

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మహాకవి కాళిదాస

[ఏడంకముల నాటకము]

గ్రంథకర్త:

శ్రీ ఆవటపల్లె హనుమంతరావుగారు

తృతీయ ముద్రణము

పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి.

1951



[ వెల 2—0—0

# ఇందు వచ్చు పాత్రలు

విజయవర్మ— తేజోవతీనగరాధీశుఁడు
కుముదప్రియుఁడు— ,, మంత్రి
కళాధరుఁడు—మంత్రికుమారుఁడు
కాళుఁడు—శాపగ్రస్తుఁడై గొల్లగానున్న కాళిదాసుఁడు
భోజరాజు—ధారానగరాధీశుఁడు
బుద్ధిసాగరుఁడు— ,, మంత్రి

| | |
|---|---|
| ఏకసంధాగ్రాహి<br>భవభూతి<br>బాణుఁడు<br>మయూరుఁడు<br>కవిరాక్షసుఁడు | భోజుని ఆస్థానమున వచ్చు కవులు |

కృష్ణశర్మ మొదలగు కొందఱు బ్రాహ్మణులు, గొల్లలు. పల్లెవారు, సేవకులు వత్తురు.

కాళి—పార్వతి
విద్యాధరి లేక మధురవాణి—విజయవర్మ కుమార్తె
విలాసవతి—వేశ్య
విలాసిని అండ్ చతురభాషిణి—విద్యాధరి చెలికత్తెలు

# నాంది

శా. శ్రీలున్ విద్యయు సొంపు పెంపెసఁగ ధా ♦ త్రిన్ గాళియున్ వాణియున్
లీలామానుషరూపముల్ దనరఁగా ♦ శ్రీదాస భోజాఖ్యలన్
వాలాయంబుగ నెల్లరన్ సుకవితా ♦ వాల్లభ్యమేపారఁగా
నోలాడించిరి హర్ష వారినిధి నా ♦ యుల్లాసమింపొంగుతన్.

(పుష్పాంజలింజల్లి)

పారిపార్శ్వకా! ఒకసారి యిటురమ్ము.

పారి—ఆర్యా! నన్నుఁబిలిచిన కార్యమేమి?

సూత్ర—అభినయధురీణులును సకల కళాకోవిదులును రసిక శిఖావతంసులును విమర్శ కాగ్రేసరులునగు సభాసదులెల్ల రప్పుడే నాట్యభవన మలంకరించి యుండిరి. వీరినొక నూతన రూపకాభినయ ప్రదర్శనములచేఁ దృప్తిపఱుపనెంచిన మన కుశీలవులు సిద్ధముగా నున్నారేమో చూచెదవా?

పారి—మంచిది. చూచుటయే కాదు. త్వరగా సిద్ధము గావల సినదని వారలను హెచ్చరించి వచ్చెదను. కాని ఇట్టి రసికులఁ దామేనాటకంబుచే నానందపఱుపఁ దలంచితిరో సెలవిచ్చెదరా?

సూత్ర—అట్లు ప్రశ్నించెదవేల! రసికవరులు మహారసిక శిఖా వతంసుని చరిత్రమునే యుపేక్షింతురుగదా? అందు జగ ద్విఖ్యాతవిపశ్చిద్వరేణ్యుఁడును భోజసభాభూషణాయమాను డును బరేంగితజ్ఞాన మహామహిమోన్నతుఁడునగు శ్రీ కాళి దాస కవీంద్రుని చరిత్రము నాటకంబుగా నభినయింప నుంటిమి.

పారి—లోకవిఖ్యాతిగడించిన నాటకకర్తయొక్క చరిత్ర నాటక
మాడుట ప్రశంసార్హమే కాని కావ్యము రసవంతముగా
నుండవలయును గదా! ఎట్లున్నను నట్టి మహనీయుని చరి
త్రము వర్ణింపఁబూనినంత నే యాకవి ధన్యాత్ముఁడై యుండ
నోపు. ఆతని నామమెద్దియో తెలియఁ జేసెదరా?

సూత్ర—శృంగారహాస్య కరుణాదిరసముల కాలవాలమై

ఉ. పావనమై సుధామధుర • భవ్యము నై కవిలోక నిత్యసం
భావిత కాళిదాస కవి • వర్య భూ దివ్యమహాచరిత్ర మా
యావటపల్లె వంశ కుము • దాప్తుఁడు నాగనుమంత రాయుఁడిం
పావహిలంగ వ్రాసె రసి • కాగ్రణులెల్లరు సంతసింపఁగన్.

(దిక్కులు పరికించి) ఓహో! మన శ్రీనాథుఁడప్పుడే
కుముదప్రియుని వేషముధరించి రంగస్థలముపైకి వచ్చు
చున్నాఁడు. కావున మన మీ స్థలము నువిడచి లోనికిఁ
బోయి తదుపరి యత్నమున నుందము రమ్ము.

(ఇద్దరు నిష్క్రమింతురు)

---

# మహాకవి కాళిదాస

## ప్రథమాంకము

### 1 వ రంగము

[తేజోవతీనగర రాజగు విజయవర్మ, మంత్రియగు కుముద ప్రియుడు ప్రవేశించుచున్నారు.]

కుముదప్రియ—ప్రపంచమునం బురుషునకుంగల చింతలలోకెల్లం బరిణయయోగ్య వయస్కురాలగు కుమార్తె కనుకూల దాంపత్యము గుదుర్చుటయను చింతయే గొప్పది. ఈ మా విజయవర్మ మహారాజ పుత్రికయగు విద్యాధరికిం దగిన వరునిం గుదుర్పవలెనని ప్రయత్నించుచున్నారము. ఈపె విద్యాధరి యను నామమున కెంతయో వన్నె దెచ్చు విద్యావతి. ఇట్టియామెకుం దగిన వరుండు దొరకుట కడు దుర్లభము. ఆహా! ఈవిషయమై రాజున కెంత మనస్తాపము గలదో కదా!

సీ. తనకూర్మి తనయకు ♦ ధవుండు నిర్ధనుండైన
జనకుమానస మెట్లు ♦ శాంతిపడును?
తనముద్దు తనయకు ♦ ధవుండు దుష్టుండైనం
దండ్రిచిత్తంబెంత ♦ తల్లడిల్లు?
తనప్రియ తనుజకు ♦ ధవుండు మూర్ఖుండైనం
దండ్రి దుఃఖమునకు ♦ దరిదొరకునె?
తనపేర్మి తనయకు ♦ ధవుండు రూపసిగామిం
గన్నతండ్రికి వెత ♦ గలుగకున్నె?

గీ. కటకటా ! యోఁడుబిడ్డలఁ గన్నవారి
తనయ కనుకూలపతి దొర ◊ కినను సరియె
లేకయున్నను దన్మనః ◊ క్లేశమునకు
మేరగలదొక్కొ యరయ భూ ◊ మీతలమున.

రాజు దేశదేశముల కేగి యందలి రాజకుమారులఁ బరీక్షించి వారి చిత్రపటములఁ గొనిరమ్మని నాకాజ్ఞయిడెను. బాల్యము నుండియు విద్యాధరిజతలో నొక గురువునొద్దనే విద్యా వ్యాసంగ మొనర్చి రూపలక్షణ వయోధర్మముల యందాపె కనురూపుడై యున్న నాకుమారుని గూర్చి తలఁపనే తలఁపఁడు. పోనీ నేనైనఁ గదలింతమన్న ననుచితమని యూరకుందును. (తలపంకించి) రాజాజ్ఞ నెఱవేర్చుటయే కర్తవ్యము. (వరాన్వేషణార్థమైపోయి నేఁడేకదా వచ్చితిని. కావునఁ గాలయాపన మొనర్పక వేగమే రాజును గలిసి కొని యవకాశ మొదవినపుడు తప్పక నావాంఛిత మెఱింగించి చూచెద.) (అని నిష్క్రమించును)

---

## ద్వి తీ య రం గ ము

[విజయవర్మ రాజు ప్రవేశించుచున్నాడు.]

మంత్రి యనేక దేశములు తిరిగితిరిగి రాజకుమారుల చిత్ర పటములఁ బంపెను. వీనినిజూపించి యిందెవరిని వరించునో తెలిసికో వలెను. (ప్రక్కజూచి) తనయా విద్యాధరీ!

విద్యాధరి—[ప్రవేశించి] నాన్నగారూ ! నమస్కారము.

విజయవర్మ—అమ్మా ! కల్యాణమస్తు ! తల్లీ, నేనొక విషయమై నీయభిప్రాయ మెఱుంగవచ్చితిని. దానికి నీవు తగిన సమా

ధానము చెప్పవలెను. ఇదిగో యిటుచూడుము (అని చిత్ర
పటములను జూపించుచు)

సీ. మహితబలాఢ్యుఁడో ♦ మాళవేంద్రుఁడితండు
నంగజతుల్యుఁడీ ♦ వంగవిభుఁడు
గుణసాంద్రుఁడైనట్టి ♦ కొంకణేశుఁడితండు
సిరిగలవాఁడు కా ♦ శ్మీరరాజు
అపరపంచశరుండ ♦ యంగభూపుఁడితండు
సాహసనగము కో ♦ సల నరపతి
ధర్మస్వరూపుఁడీ ♦ ద్వారకాధీశుఁడు
కరుణామయుండు మా ♦ గధ నృపుండు

గీ. వీరిలోపల నెవ్వారిఁ ♦ గోరినీవు
పరిణయంబాడ నుత్సాహ ♦ పడుదువొక్కొ
చిత్తమందున సరిగ యో ♦ జించిపిదప
నాకెఱింగింపు విద్యాధ ♦ రీ కుమారి.

(విద్యాధరి పటములనెల్లఁజూచి దూరముగాఁబోయి నిలచును)

విజయవర్మ—ఇంతమంది రాజకుమారులలో నొక్కనిఁగూడ నీవె
యొప్పలేదే? ఒక వేళ సిగ్గుచేతఁజెప్ప శంకించి యూరకున్నదా?
తల్లిదండ్రుల యిష్టప్రకారము వరునిదెచ్చి కుమార్తెకిష్టమైనను
గాకున్నను ముడివెట్టుట యీకాలమున సుఖాస్పదమైనది.
ఆమె యభిప్రాయము దెలిసికొనవలయునన్న మౌనముధరించి
యూరకున్నది (చూచి) తనయా!

గీ. ఖ్యాతిఁజెందిన రాజప్ర ♦ సూతనవగుటఁ
బరమ విద్యావివేక సం ♦ పదగలుగుట
భర్తనువరించుటదె నీకు ♦ వదలినాఁడ
నానఁజెందక తెల్పుమా ♦ యాననీకు.

విద్యాధరి—తండ్రీ! మకరందములను బొందని నిర్గంధకుసుమము లాస్వాదమొసంగునా?

విజయవర్మ—వీరందఱును రాజాధిరాజులు సుమా!

విద్యాధరి—శాస్త్రసంపదలు లేనివాండ్రెట్టి రాజులైననేమి! విద్యావతులగు స్త్రీలు సకలకళాకోవిదులనే వరింతురుగదా తండ్రీ! యిట్లుండ నీవు పేర్కొనినవారిలో శాస్త్రపాండిత్యమందు నన్ను జయింపజాలువాఁడొక్కఁడును లేఁడే.

విజయవర్మ—కుమారీ! వీరలలో రాజకీయవిద్యలయందారితేరినవా రనేకులుందురు. అనంతరము కాళికాదేవి యనుగ్రహమున నీవలె సకలశాస్త్రపారంగతు లగుదురని నమ్మినాను. “కన్యావరయతే రూపం” మ్మని పెద్దలు చెప్పుదురు కావున నీయభిమత మెఱుంగుటకై వారి చిత్రపటములఁ దెప్పించితిని.

విద్యాధరి—పరిమళము లేకున్నను పుష్పము తలముడుచుకొనిన మనోజ్ఞమగునా?

విజయవర్మ—అయిన సౌందర్యము నైశ్వర్యము ముఖ్యములుగావా?

విద్యాధరి—ఆయైశ్వర్య సౌందర్యములు బుద్ధివిషయములో నుండవలెను. దేహమునకంత ముఖ్యములుకావని నాతలంపు.

విజయవర్మ—పుత్రీ! నీవు మిగుల వివేకవతివి. నాతలంపును నీవు మహావిద్వాంసునే పరిణయమాడవలె ననియేసుమా. కావున మంత్రితోడ నాలోచించి వేఱుప్రయత్న మొనర్చెదను. నీవు వెళ్లుము.

---

## 3 రంగము

[మంత్రికుమారుఁడైన కళాధరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కళాధరుఁడు—కం. స్మరశరుని యింతియనఁగా
విరిదమ్ముల కనులు వెలయు విద్యాధరినిన్

చరణయుగమ్మునం దగఁ, జాలెదు
నరుండే ధన్యుండు భోగనాకము నేలున్.

ఆహా! యీరాజపుత్రి రూపరేఖావిలాసముల నెంతని వర్ణింతును? బాల్యమునుండియు నాప్రక్కను విద్యాభ్యాస మొనర్చిన యీవిద్యాధరి నేఁడు క్రొత్తగాఁ గాన్పించుచున్నది. కామోద్ధర్మలీల లన్నియు నిక్కడ నాక్రమించితివోయన్నట్లు చూచుచున్న నాహృదయమునం దామె రూపము నచ్చుపోసినట్లు జాడుకొలిపి యున్నది. విద్యాభ్యాసానంతర మామెతోడి సంభాషణమే దుర్లభమని తలంచి నిరాశచేఁ దపించుచుంటిని గాని దైవయోగమున నామె మా తండ్రిచేఁ బంపఁబడిన రాకుమారుల చిత్రపటముల నెల్లఁ దృణీకరించి శాస్త్రవాదమునందుఁ దన నోడించి వరియింపవలసినదిగాఁ దన జనకునిచే మాజనకున కెఱింగించినది. ఆమె మహావిద్వాంసురాలగుటచే శాస్త్రవాదమునకు వచ్చిన మహావిద్వాంసు లోడిపోయి యవమానముతో మరలిపోయిరి. ఇట్టిస్థితిలో నేను బ్రయత్నించినను గెలుపోటుల నిర్ణయించుటకు సాధ్యము కాకున్నది. ఓడిపోయి యవమానమును నాశాభంగమును జెంది చింతించుట కంటె నుపాయముచే నామెకు నాపై ననురాగము బుట్టునట్లు చేసినఁ జాల బాగుండును. మరియు నా బాల్య పరిచితమగు నావిద్యాశక్తియు నామెకుఁ దెలిసియే యుండుటచేత వాద మనావశ్యకమని చెప్పి యుపాయముచే శాస్త్రవాదమను తలంపే మఱపించి నన్ను వరియించునట్లు చేసికొని నా మనోరథమును నెఱవేర్చుకొనెద గాక. అదిగో విద్యాధరి చెలికత్తెలతో నందు గూర్చుండి యున్నది.

చ. గురువుల ప్రోల నీకుసుమ ♦ కోమలితోడను సర్వశాస్త్రముల్
గఱచెడివేళ మన్మథ వి ♦ కారగుణంబులు గల్గవెన్నఁడీ
తరుణి నవీనయౌవనము ♦ దాల్చి సుమాస్త్రుని బాణమో యనన్
బఱవు సితాంబకంబులకు ♦ భావము పీడనమందఁ జొచ్చెడిన్॥

కం. రతికైనయగు రూపము, భా
రతికైనయగు విద్యగల్గు ♦ రామా మణి దా
నతిగాఁగ నేరికబ్బునొ
యతనికి భూతలమె స్వర్గ ♦ మగుటబ్బురమే ?॥

ఈపెను జూచినమీఁద నెట్టివారి మనంబున నయితము చలించుచుండును. ఐశ్వర్యము సౌందర్యము పాండిత్యము మూఁడును మూర్తీభవించిన యీపెను వివాహమాడుట సామాన్యపుణ్యము గాదు (ముందుసకువచ్చి) ఓసీ! చతురభాషిణీ! కళాధరుఁడరు దెంచినాఁడని రాజపుత్రి కెఱింగింపుము.

చతురభాషిణి—చిత్తము. (అని లోనికిబోయి తిరిగివచ్చి లోపలికి దయచేయుమని రాజపుత్రి యాజ్ఞయిచ్చెను. రండు!

కళాధరుడు—మంచిది. (ముందులకువచ్చి) రాజపుత్రీ! కుశలమా!

విద్యాధరి—ఓహో! మిత్రమా! కళాధరా! కుశలముగనే యున్నాను. రమ్ము. రత్నాసనమలంకరింపుము.

కళాధరుడు— (కూర్చుండి) మనస్నేహము ఫలవంతమగు కాల మాసన్నమైయుండవచ్చునని తలంచి నీ యభిప్రాయమును దెలిసికొనుటకై యిట్లువచ్చితిని.

విద్యాధరి—అయిన నాయభిప్రాయమింకను నీకుఁదెలియలేదా ?

కళాధరుడు—నీనోటినుండియే వినవలయునని వచ్చితిని.

విధ్యాధరి— అట్లేనివినుము.

చ. ధరఁగల పండితోత్తముఁ డు ♦ దారగుణాకరుఁడెవ్వండేనియుక్
సరస వచోనిరూఢి నను ♦ శాస్త్రవివాదమునన్ జయించినన్
బరమ విధేయురాలనయి ♦ భర్తనుగాఁగ వరింతు లేనిచో
నరయఁగ జాల వాని సుగు ♦ ణాకర ! మిత్రవరా ! కళాధరా !॥

ఈకారణముచే నీవు నన్ను శాస్త్రవాదమునందు జయించితి వేని నీకోరిక ఫలింపఁగలదని నాయభిప్రాయము.

కళాధరుడు— కమలాననా! నీయాలోచనచాలు! పండితులతో వాదించినంతమాత్రమున నీకువచ్చు కీర్తియేమి?

విద్యాధరి— అమాత్యనందనా! కీర్తికొఱకే నేనీ శాస్త్రచర్చఁ గావించుటలేదు. అనుకూల వరాన్వేషణమునకును బరీక్షించు చుంటిని. ఇది తప్పా?

తే. గీ. మనసుగలసినవారితో ♦ మనువుఁగూర్చి
నంత ననుకూలదాంపత్య ♦ మబ్బుఁగాని
మనసుగలియని వారితో ♦ మనువు సేయఁ
గష్టమొదవదొకో? కల ♦ కాలమకట.

కావున శాస్త్రచర్చయందు నన్ను జయించువాఁడే నాకు నచ్చినవాఁడు. నాసంకల్పముప్రకారము నీవు శాస్త్రవాదమున నన్ను జయించితివేని నీయిష్టము నెఱవేఱును.

కళాధరుడు—ఓ కళాతరంగిణీ! యిట్టి సంకల్పములచేతను బ్రతిజ్ఞల చేతను లాభములేదు మనమిరువురమును బాల్యమునుండియు నొక గుఱువునకే శిష్యులమై సమానవిద్యను బడసితి మను సంగతి నీవెఱింగియే యుందువు. నీవు మహావిద్యావతి వను కీర్తి వెలుగొందుచున్న దందఱిన్ము. ఇప్పుడు నీకపజయము సంప్రాప్తమయ్యె నేని పూర్వ మార్జించిన కీర్తియు నశించును. ఓముగ్ధా! ముందేమిరానున్నదో! నాకు దురూహ్యముగా నున్నది. లేక నీచే నేనోడిపోయితినేని యిఁక నీకు దగిన విద్వాంసుఁడు దొరకుట దుర్లభము. కావున శాస్త్రవాదమను చర్చను మానుము.

నీకీవింత పరీక్షయేల? కరుణఁ జూపి నీమిత్రుఁ నేలుకొనుము.

విద్యాధరి—చాలు! చాలు! నీమాటలు చాలింపుము. మైమఱచి స్త్రీలముందు మేరమీఱి మాటాడకుము.

కళా—నన్నింత వేధించుటకు నీకు హితముగా నున్నదా?

విద్యా—(కోపమున) కళాధరా! యిట్టిమాట లింకఁ జాలింపవా?

కళా—అంగభవుని యావేశమే నన్నిట్లు పలికించుచున్నది.

విద్యా—అవును. నీకు మోహపిశాచ మావేశమైనది. దానిని వదలించుకొని మాటలాడుము.

కళా—నీకుఁబట్టిన శాస్త్రపిశాచము వదలినచో నాకుఁ బట్టిన మోహపిశాచము దనంతఁ దానే తొలఁగిపోవును.

విద్యా—నోటికివచ్చినట్లు మాటాడకుము. నీసంకల్పము నెఱవేఱు నను తలంపుతో నిట్లు పలుకుచున్నావు కాఁబోలు. నీకంత యభిలాషయున్నచో శాస్త్రశక్తి గలదేని చర్చఁజేసి నన్ను గెల్చి గౌరవమును బొందుము. లేదా త్వరగా నఱలిపొమ్ము.

కళా—(తనలో) మంచిది! యీమె నామాటలకు లొంగలేదు. మహాకాళి యుపాసనచే జగద్విఖ్యాత పాండిత్య మార్జించిన యీమెను జయించు టసాధ్యము. ఇట్టిశక్తిని వృథాచర్చచేసి యోడి యవమానమును జెందుటకంటె మౌనముగా నుండు టుత్తమము. మహనీయులగు పండితుల ననేకుల నవమానపఱచినదికాక మిత్రుఁడ నగు నన్ను సైతమలక్ష్యముఁ జేసినందులకు ఫలము కలిగితీరును. ఈ విషయ మెల్లను మా తండ్రి కెఱిఁగించి యేవిధముగానైన నీమెకు గర్వభంగము గావించెదను. (ప్రకాశముగా) రాకుమారీ! నీచిత్తస్థైర్యము కడు శ్లాఘ్యమైనది. నిన్ను జయింపఁదగిన మహావిద్వాంసునే పరిణయమాడెదవు. కాని బాల్యస్నేహముచేత మాటాడిన నామాటలకుఁ గినియకుందువుగాక. నేను బోయివచ్చెదను.

విద్యా—కళాధరా! నాసంకల్పమును మీఱరాదను తలంపుననే నాడినమాటల కన్యథాతలంపక నన్ను మన్నింతువుగాక.

కళా—మంచిది.

(అని నిష్క్రమించును)

[విజయవర్మ ప్రవేశించి]

విజ—తనయా! కళాధరుం డరుదెంచెనా?

విద్యా—తండ్రీ! వచ్చి యిప్పుడే వెడలెను. నాతో విద్యా చర్చ కాతఁడొప్పుకొనలేదు.

విజ—కానిమ్ము అట్లయిన మంత్రివర్యుని బిలిచి శాస్త్రజ్ఞుఁ డయిన వరుని వెదకఁబంపెదను.

విద్యా—అటులనే చేయుము.

(తెర వ్రాలును)

# మహాకవి కాళిదాస

## ద్వితీయాంకము

[కుముదప్రియుఁడు మంత్రి ప్రవేశించును]

మంత్రి—నా పుత్రుఁడయిన కళాధరుని రాజపుత్రి వరించినచో దాంపత్య మత్యుత్తమముగా నుండెడిది. మాయిరువురకు మిగుల సంతసము గల్గెడిది. కాని యామె విద్యావతినను గర్వముచేత ననేక విద్వాంసుల నవమానపఱచుటయే కాక తనకు సమానవిద్యావంతుఁడయిన మా కళాధరునిగూడ నిరాకరించి యుదాసీనభావమున మాటాడినదఁట. ఇంత దురహంకారిణియైన యీమెకుఁ దగిన గర్వభంగము గావింపవలయును. దీనికి దగిన సమయము నాకుఁ దొరకినది. దూరదేశమందుఁ దగిన విద్వాంసు లున్నచోఁ గొనిరమ్మని రాజు నాకాజ్ఞయిడెను. కావున నిప్పు డెవనినో యొక యవివేకిని గొనివచ్చి మహావిద్వాంసుడను భ్రాంతి యామెకుఁ గలిగించి వివాహ మొనర్పజేసి యామెకుఁదగిన పరాభవము గావించెదను. (ముందునకు నడచి) రాజపుత్రికకుఁ దగినవరుఁడు లభించు టెంత కష్టముగా నున్నదో నా చిత్తమున కనుగుణమగు నవివేకి లభించుటయు నంతకష్టముగనే యుండును. ఎంతకష్టమైనను గానిమ్ము. ఆమెకుఁ దన ప్రతిజ్ఞ యెంత ముఖ్యమో నాకును నాప్రతిజ్ఞ యంతటి ముఖ్యమే కావున నెట్లైన కులీనునేని కులహీనునేని నరసి రాకాఁడగు మూర్ఖనొకనిని వెతకి తెచ్చి యుపా

యముచే విద్యార్థులకీ పట్టంగట్టినచో నాతను మూంకి శాధకు వశుడను మనశ్శాంతి కలుగును. అనంతరం మాదంపతుల విలాసములు చూచుట కొంతదనుక సాగును. అప్పుడు తామ మున్ను విద్వాంసుల నోడించి పరిభవించి గర్వించినదానికి దగిన ప్రతిఫలము గర్వభంగము నాపె గ్రహింపఁగలదు. ఆపె కీర్తి యిప్పుడు లోకములో ప్రఖ్యాతమైనట్టుల నాపెభర్త కీర్తియు వెలయును. నాతలంపునట్లైన స్త్రీలకుఁదగిన బుద్ధి వచ్చుట కవకాశము కల్గును. గల్పించినవాఁడనగుదును. అందులకే యిప్పుడు రాజసభకుఁజను విద్వాంసులకనుబోయి వరుని వెదకుటకుమాఱు శుద్ధపామర జనులుండు తావునకు బోయి యొకవరుని వెతకవలెనని యారణ్యమున కరుదెంచితిని. గొల్లల (కోలాహలమువినబడ-దిక్కులుచూచి)

ఉ. అల్లదెగోత్రులమందల బ ♦ యళ్ళను మేపుచు జల్దిదిక్కులుముల్
పిల్లనగ్రోవి,మూఁపునను ♦ ప్రేలెడు గొంగడి,కొంకెకఱ్ఱయున్
ఘల్లను శబ్దముల్ చెలఁగు ♦ కాటమురాజు కథానులాపముల్
గొల్లల దోప,జేయుఁ గయిఁతొందు సిఁకందొఁ వెఱ్ఱిగొల్లనిన్.

[కొందఱు గొల్లలు కోలాటము వేయుచు బ్రవేశింతురు]

కీర్తన

వీరూడవయ్యా నీవు, కాటమ రాజా । సధీరత్వమెంత సెప్పుదు
కాటమ రాజా!

సుక్కల్లో సెందురుడట్టు । కాటమ రాజా । సెవు। సూచికనపడ్డావయ్యా
కాటమ రాజా॥

కాసీవారలనెల్ల। కాటమ రాజా।సీవు।కీర్తికబలిము స్తివి। కాటమ రాజా॥
జయమునేర్చితివయ్యా॥ కాటమ రాజా । నీ । సత్తువెల్ల తెలిసెనయ్యా।
కాటమ రాజా॥

బుడ్డెంకడు—బలేబాగుందిరా మామా! నాకూడా సెప్పియ్యరా

యీరడు—పోరా! నీకెక్కడొస్తుందిరా!

బుడ్డెంకడు—పోనీలే మామా (చుట్టుచూచి) ఒరే సుబ్బా యెంకా! గొఱ్ఱెలన్నీ పారిపోతుండయి పోదాము పదండ్రా (పోవుచుందురు)

[మంత్రి ప్రవేశము]

మంత్రి—ఆహా! వీరలలో నాకుఁ గావలసిన గుణములు గలవాఁడు దొరకునేమో చూచెద.

కాళ—ఒరే బుడ్డెంకా! నాగొఱ్ఱెల్ని కూడా యిట్లా తోలరా, నే సెట్టెక్కి కొమ్మలు కొడ్తాను (చెట్టెక్కి కొమ్మమీఁద నిలుచుండి కొమ్మ మొదటిని నఱకుచుండును)

మంత్రి—ఆహా! సరిసరి! నాయుద్దేశ్యమున కనుగుణముగా నున్నవాఁడితఁడే. కొమ్మమీఁద నిల్చి దాని మొదటిని నఱకుచున్నాఁడు. (చక్కఁగాఁ జూచి) వీని మొగమెంతయో తేజోవంతముగా నున్నది. రూపమునందును వయస్సునందును నాయిష్టానుసారముగ నున్నాఁడు.

మ. విలసన్నేత్రయుగంబుతోడ వదనా ♦ విర్భూత తేజంబుతో
లలిత భ్రూసికటంబుతోడను దనూ ♦ లావణ్య భాగ్యంబుతోఁ
గలదాజానుభ శరీర సద్విపుల వ ♦ క్షస్సీమతోఁ గ్రాలుచున్
జెలువొప్పారెడు వీఁడు గొల్లడనఁగాఁ ♦ జిత్రంబు గాఁదో చెడీ.

కాని,

తే. వదనమరయంగఁ జంద్రబిం ♦ బంబుఁ బెగడు
పలుకువిన శుద్ధ మూర్ఖుని ♦ వలెనుదోఁచుఁ
గోమలంబైన నిర్గంధ ♦ కుసుమమట్లు
వీనిబుట్టించిన విధాత ♦ వెఱ్ఱిగాఁడె.

ఈతని మాటలను జూడఁగా బ్రాహ్మణపుత్రుఁడో క్షత్రియుఁడో యని తోఁపకమానదు, అయిన శూద్రులలో నుండెను గదా? ఒకవేళ నుత్తమజాతికిఁ బుట్టి కారణాంతరములచే నీజనులలో నేల చేరఁగూడదు? అదెట్లయినను గానిమ్ము. నా యభిమతమునకుఁ దగిన సౌందర్యశాలియు బుద్ధిశాలియు దొరకెను

కాళి—(మంత్రినిజూచి) ఓయీ ఆ గొఱ్ఱెల్నిట్టాతోలు.

మంత్రి—(నవ్వుచు నిలచును)

కాళి—ఓరి నీయిల్లు బంగారంగాను సెవుడా యినపట్టల్లే? ఆయెల్ల గొఱ్ఱె నిట్టామళ్లెయ్యి.

మంత్రి—వినఁబడుచునే యున్నది. కాని కొంచెమాఁగు ! ఆకొమ్మను గొట్టవద్దు.

కాళి—సరి! సరి! ఓరాసె నీవు? కొమ్మ నీయబ్బసొమ్మా? పో! పో! యీడకెందుకొచ్చావు ?

మంత్రి—ఆమాటటుండనిమ్ము. ఆకొమ్మను నఱకవద్దు నీవు పడి చచ్చెదవు.

కాళి—నేనెందుకు సస్తాను. అది నీతలమీఁద పడితే నువ్వేసస్తావు. యీమాత్రం తెల్వదు. కొమ్మనఱికితే నానెత్తిమీఁద బడుతుందా? కిందపడుతుంది, నేను సెట్టుమీఁద నుంచున్నాగా! సూత్తంతయినా తెల్వదేం, అదేఁమనిశివోయి.

మంత్రి—(తనలో) ఇతఁడుతప్ప నింకెవ్వరును వలదు. ఇతఁడేసరి. (ప్రకాశముగా) ఓరీ నీనివాస మెక్కడ?

కాళి—వాసమెందుకు, ఆకులు కోసుకుంటావా? (అని కొంకికట్టి యియ్యఁబోవును)

మంత్రి—అదిగాదురా?

కాళి—కాదుటే. యిది వాసంకాదు. దీన్ని కొంకికట్టంటారు.

మంత్రి—ఓరీ కుఱ్ఱా! అది నాకక్కరలేదు.

కాళి—చొంటికొచ్చా! యాడలేదే.

మంత్రి—ఛీ. మొద్దు!

కాళి—మొద్దు కావాలంటయ్య

మంత్రి—బాగున్నది! కాదుగాని నీవుండేది యెక్కడ?

కాళి—ఇదిగో చెట్టుమీఁద కనపట్టల్లే! అట్టా అడుగుతారేం.

మంత్రి—(తనలో) ఇన్ని ప్రశ్నలు వేసినను వీనిని యూరే తెలియ లేదు. ఇంకొకవిధముగా నడిగి యితని వృత్తాంతము దెలి కొనియెద (ప్రకాశముగా) ఓరీ! నీవు భోజనము చేయు దెక్కడ?

కాళి—అహాహా! (అని నవ్వుచు) యెక్కడా! కంచంలో! యిదంత యెందుకడుగుతాన్! నీకేం తనూనాగావుం దేం.

మంత్రి—ఓయీ! కోపపడవద్దు చెట్టుదిగిరమ్ము.

కాళి—(తనలో) యీడేం దెయ్యమల్లే పట్టుకున్నాఁడు. (అని దిగి వచ్చును.)

మంత్రి—ఓయీ! నీయిల్లెక్కడ?

కాళి—అదిగో! ఆడ పెద్దమఱ్ఱిసెట్టుందే దానికి సూటిగాపోతే ఆదిబ్బ మీఁద గంగానమ్మగుడుందే ఆడుందీ.

మంత్రి—నీకు తలిదండ్రులున్నారా?

కాళి—తల్లో దండ్రో నాకు తెల్వదు. మాదొరోడుండాడు యిదంతా నీకెందుకయ్యా నువ్వెందుకొచ్చావో సెప్పరాదూ?

మంత్రి—ఒకపనిమీఁద దేశంబులవెంటఁ దిరుగుచుంటిని.

కాళి—దేశాలట్టుకు తిరగడానికి యింటికాడ ఆడోళ్ళతో పోట్లాడొ చ్చావా?

మంత్రి—ఛీ! అదిగాదురా? ఒకపిల్లకుఁ బెండ్లికావలసియున్నది.

కాళ—అట్టాగైతే నన్నడిగితేయేంలాభం ? మా పెద్దగొల్లనడిగితే చేగో అద్దచేరో జొన్నలిత్తాడు.

మంత్రి—నేను యాచనకు రాలేదు. ఒకపనిగా నిన్ను దీసికొనివెళ్లుటకు వచ్చినాను.

కాళ—ఓ అట్లాగా ఆమాటిందాకే సెప్పవేం ?

మంత్రి—నీకు వివాహమయినదా ?

కాళ—(సంతోషముతో) అంటే చోబనబా! నాకింకా లేదు.

మంత్రి—సరి! మంచిది. అయితే నావెంటవచ్చెదవా ?

కాళ—పిల్లనిప్పిత్తానంటే వత్తా

మంత్రి—ఆ! అటులనే మంచిచక్కని కన్య నిప్పించెదను.

కాళ—అట్టైతే లగెత్తుకొత్తా. సరేగాని నీవోరయ్యా ?

మంత్రి—నేనిక్కడకు సమీపముననున్న తేజోవతీనగర రాజుగారి మంత్రిని.

కాళ—ఆలాగంటయ్యా! (చక్కగాజూచి) నిబుద్ధిగా నేనరయ్యా ఆమాళ రాజుగారింటో పెళ్లికిగంబోసు పందిరెయ్యటానికీ పిల్చారు. నేను పైకెక్కి పందిరేత్తుంటే నావంకే సూస్తా నాకాళ్ళకిందనుండిపోయావు ఆయాళే సూశా!

మంత్రి—(తనలో) ఇతఁడు నాగరికతయనునది స్వప్నమందయిన నెఱుఁగనట్లున్నది. కానిమ్ము. ఉపాయముచే దారికిఁ దేవలెను, (ప్రకాశము) ఓయీ! ఆపాడుగొంగళి పారవేయుము.

కాళ—అమ్మో సలికి సత్తుంటే మాపెద్దగొల్ల నాకిచ్చాడు పారెయ్యాలీ మంచోడివేలే నాక్కావాలి (అని దానినిముడిచి) 'టుర్ ప్యా' అని గొఱ్ఱెలను దోలుకొనుచుఁ బోవును.

మంత్రి—ఓరీ! పోవొద్దు నీకుఁ జక్కనిబట్టలనిచ్చెదను. వానిని దొడుగుకొనుము. ఈగొఱ్ఱెలను విడిచిపెట్టుము.

కాళ—యిడిత్తే. గొఱ్ఱెల్ని నువ్వుకాత్తుంటావా?

మంత్రి—ఏమైనను గానిమ్ము. నీకాలోచనవద్దు. (అనిగుడ్డలనీయఁబోవ)

కాళ—(ఆశ్చర్యమున) అబ్బో! బలేసోగ్గాఁడుందే! అదేందో తమా సాగావుంది నువ్వేతోఁచుగయ్యా.

మంత్రి—(వస్తులను దాఁచుకొనును) ఇంక నీనోటికివచ్చినట్లు వాగితివా చూడు. నోరు తెఱచినఁ జావఁగొట్టెదను.

కాళ—నోరు తెఱవకుండావుండే బువ్వెట్టాతినేది?

మంత్రి—ఛీ! మూర్ఖుఁడా! అట్లనిన మాటాడవద్దని యర్థము పెండ్లి యగువఱకు మాటాడవలదు.

కాళ—సరేలెగండి (అని నోరుమూసికొనును)

మంత్రి—నీపేరేమి?

కాళ—(నోరుమూసికొనియుండును.)

మంత్రి—ఓరీ! నోరు తెఱవవేమిరా!

కాళ—ఆఁ (అని నోరుతెఱచి నిలుచుండును)

మంత్రి—(తనలో) వీనిని గాఁబఱచుకొనుట బహుకష్టము. (ప్రకాశముగా) ఓరీ! మాటాడుము.

కాళ—ఇదేమయ్యా! గడెకోటిసెపుతావు. అప్పుడొద్దంటివి. ఇప్పుడు మాట్లాడమంటావు. యేం సావనా! నీచోఁబనంవద్దు. గీబనంవద్దు. నేయెల్లిపోతాలే. (అని పోఁబోవ)

మంత్రి—(చేయిపట్టుకొని) ఓరీ! మూర్ఖుఁడా! వెళ్ళవద్దు. నీకుపకారముచేసెదను.

కాళ—బాబో! నీవుప్పకారం నాకు సైపియ్యదుగాని యింతజొన్నంబలుంటే యియ్యి.

మంత్రి—అదిగో! పిచ్చిపిచ్చిగ మాటాడవలదు. నేను గొన్నిసంగతులు చెప్పెదను. అవి మాత్రము చెప్పుము. ఇష్టము వచ్చినట్లు మాటాడకుము.

కాళి—యిట్ట మెచ్చినట్టు మాటాడకుమా.

మంత్రి—ఓరీ! తెలివితక్కువ పెద్దమ్మా నేను చెప్పేది విను.

కాళి—ఓరీ! తెలివితక్కువ పెద్దమా నేను చెప్పేది విను.

మంత్రి—ఛీఛీ! నోరుమూయుము.

కాళి—ఛీఛీ! నోరుమూరుము.

మంత్రి—అది కాదురా, ఆగు.

కాళి—అది కాదురా, ఆగు.

మంత్రి—(ఆత్మలో) వీనిని దారి కెట్లు తేవలయునో దేవుని కేఎఱుక. ఇటువంటి వాని నావిద్యాధరికిచ్చినచో( జక్కఁగానుండును. మంచిది. ఎట్లులైనను గొన్నిసంగతు లితనికిఁ జెప్పి రాజాస్థానమందితఁడు మహావిద్వాంసుఁడని యొప్పించి యుపాయముచే నా కార్యము నెఱవేర్చుకొనెద. (కాళునిజూచి) అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, (అని నక్షత్రములపేళ్ళు చెప్పించును)

కాళి—(బహుకష్టముతో నాపేరులనుజెప్పి) నన్ను సంపుకుతింటావేమయ్యా! బెమ్మరాచ్చసిలాగు పట్టుకున్నావే.

మంత్రి—పోనీగాని, ఇదిగో! నీవు వెళ్ళినవెంటనే రాజుచేతులిట్లు జోడించును. నీవు నదేవిధముగఁ జేతులుజోడించి. అశ్వని భరణి, యను నక్షత్రములపేర్లు వరుసగాఁ జెప్పుము. తరువాత రాజు నిన్ను శాస్త్రములేమి చదివి కొన్నారని యడిగినచో నాల్గువ్రేళ్ళు చూపింపుము. ఇట్లే యెప్పటికప్పుడు నేను గంటితో సైగఁ జేయుచుందును. నీ వివన్నియును బాగుగ జ్ఞాపకము పెట్టుకొనవలయును.

కాళ——అయితే సిక్కేనే! తెలవనప్పుడు చెయ్యిసూపనా ?

మంత్రి——ఛీ! అవివేకీ! అట్లుకాదు. నీవు మాటాడఁగూడదు, అవసరమైన నేనే చెప్పెదను. ఊరక నా వెంట రమ్ము.

కాళ—— నా పాతగొంగళి మాత్రము తెచ్చుకోని! తెచ్చుకున్న తర్వాత సక్కంగా ఉతుకూర్కుంటూ, అయితే నాగొఱ్ఱెల్తో!

మంత్రి——నీగొఱ్ఱెలను నీయింటికిఁబంపెదము. మఱేమియు భయము లేదు. మాటాడక నా వెంటరమ్ము.

(నిష్క్రమింతురు)

---

## 2. రంగము.

[విజయవర్మరాజు విద్యాధరితో మాటాడుచుండును]

రాజు——కం. ధరఁగల రాజ్యము లెల్లను
దిరిగియు విద్వాంసుఁడొకని ♦ దెచ్చెదనని సం
బరమున నరిగిన మంత్రికి
దొరకునొ పండితుఁడొకండు ♦ దొంకఁడొ జగతిన్.

విద్యాధరి——తండ్రీ! మనయిష్టము వచ్చినట్లుగా సకల గుణసంపన్నుఁడు దొరకుట సులభసాధ్యమా ?

రాజు——అయినను, మంత్రి, కార్యసాధన కాని దే మరలి వచ్చువాఁడు కాఁడు.

ప్రతీహారి——(ప్రవేశించి) జయము! జయము రాజేంద్ర! మంత్రిగారెవ్వరో విద్వాంసునితో దయచేసినారు.

రాజు—— ఆహా! సంతోషము. అతఁడు కార్యసాధన కానిదే మరలి రాఁడని నేనన లేదా ? (సేవకునిదిక్కు) వారల నుచిత

మర్యాదలతోఁ దోడ్కొనిరమ్మని మంత్రిగారికిఁ దెలియఁ
జేయుము.

ప్రతీహారి—చిత్తము. (అని నిష్క్రమించును)

మంత్రి—(కాళునితోఁ బ్రవేశించి) పూజ్యుఁడా! ఇట్లు దయ
చేయుము.

విద్యా—(తెరప్రక్కను నిలిచియుండును)

రాజు—ఓహో! మంత్రివర్యా! నా కార్యము నెఱవేర్చికొని వచ్చి
నందులకు మిగుల సంతోషము.

మంత్రి—రాజా! నిజమే కాని, కాలవిలంబమునకు క్షమింపవలయును.
నేను దేశదేశములు తిరిగి యతిప్రయాసముచే నీ మహా
నియుని గలిసికొని తమ పుత్రీకారత్నమునకుఁ దగిన వరుం
డితఁడేయని నిశ్చయించి వీరని దీసికొనివచ్చితిని. ఇట్టి వివేక
వంతుని నేనెక్కడను జూడలేదు.

రాజు—(కాళునిజూచి తనలో)

శా. ఆకర్ణాంతవిశాలమైన కన్నుగవతో ♦ నాజానుబాహాస్తంభులన్
రాకాచంద్రముఖంబుతో సకల శా ♦ స్త్రజ్ఞాన తేజంబుతో
లోకాతీతమనోజ్ఞమూర్తి వినుతా ♦ లోకంబుతోఁ బ్రేక్షకా
స్తోకానందము సంగ భాగ్యవశతన్ ♦ దోతెంచె మాపీఁటికిన్.

(ప్రకాశ) మహాత్ముల పాదధూళిచే నస్మందిరంబు పవిత్ర
మయ్యె (అని నమస్కరించును.)

మంత్రి—(కాళునిజూచి కన్నుసైగ చేయును.)

కాళి—(మఱచిపోయి తనలో) అదేందో సెప్పాడు మరసిపోయానే!

మంత్రి—మహాత్మా! ప్రభువు నాశీర్వదింపుఁడు.

కాళి—(జ్ఞాపకమురాఁగా) అశ్వని, పునర్వసు, కృత్తిక, రేవతి,
(అని చెప్పును.)

రాజు—(ప్రక్కకుఁ జూచి) మంత్రీ! ఈ మహానీయుఁడు కొన్ని నక్షత్రముల పేర్లు చెప్పి యూరకుండెను. ఈయన భావమే గోచరింపకున్నయది.

మంత్రి—(తనలో) బళే తెలివితక్కువవాఁడు దొరకెనే! (కాళుని దగ్గఱకువచ్చి మెల్లఁగా) ఓయీ! అవి వరుసగాఁ జెప్పలేవా?

కాళ—మఱిసిపోయానయ్యా! గ్యాపకముంటే సెప్పనూ?

మంత్రి—(మెల్లగా) చాలు! చాలు! ఇంక నోరుమూయుము. (రేని దిక్కై) పూజ్యుఁడా! ఆ మహానుభావుఁడు తన భావము నీవిధముగా వివరించెను.

తే. గీ. అశ్వసంతానచయము పెం ♦ పారుచుండ
భూరివసువు పౌనఃపున్య ♦ ముగఁ బెరుగఁగఁ
గృత్తికాసుతు బలముతోఁ ♦ గీర్తిఁగనుచు
రేవతీశానుజు కృప వ ♦ ర్ధిల్లుమయ్య.

విద్యా—(చాటుననుండి) ఆహా! యీతనిభావము నాకును స్ఫురింపలేదు. ఇప్పుడే యితనిచే నేనోడిపోతిని. ఇతని యాకారమును దేజస్సును, యోగినులను గూడ మోహపరవశుండ్రనుగాఁ జేయకుండునా?

రాజు—మంత్రీ! అపరసరస్వతి యనఁబరఁగు నీ మహానీయుఁడు దొరకుట మాపూర్వపుణ్య సుకృతము. ఈతని వృత్తాంతమును వివరముగా నెఱింగించినచో [illegible] నాగరికులుగూడ మిగుల సంతసించునని తలంచెద.

మంత్రి—

ఉ. భూరివివేక సన్నుతుఁడు ♦ పూజ్యుఁడు పూతచరిత్రుఁడైన శృం
గార రసస్వరూప బుధ ♦ కాండశిరోమణి సర్వసత్కళా
వారిధి కుంభసంభవుఁడు ♦ పావనభాసుర, భూసురాన్వయుం
డీరసికాగ్ర శేఖరుఁడిఁ ♦ కేమని చెప్పుదు రాజపుంగవా?

రాజేంద్రా! ఈ భూసురాగ్రణి కళాకౌశలమును వాక్చాతుర్యము నెంతని వర్ణింతును?

విద్యా—(ఆత్మగతము) ఆహా! యీతని మనోహరాకారము, నాకారమునకుఁ దగిన ప్రజ్ఞయు మిగుల నాశ్చర్యముగా నున్నయవి. ఇంక నీతనితోఁ జర్చించి పరీక్షింప వలయున నెడి కుతూహలమును దగ్గిపోయినది.

కాళి—చుట్టునున్న చిత్రపటములఁజూచి) రాభణ! రాభణ! (అని పల్కును)

రాజు—(మెల్లగా) మంత్రీ! ఇదేమి, రావణుని చిత్రపటమునుజూచి రాభణ, రాభణ యనుచున్నాఁడేమి?

విద్యాధరి—నాకు నిది సంశయమును నాశ్చర్యమును గలిగించుచున్నయది.

మంత్రి—(ఆత్మలో) ఈమూర్ఖుఁడు నోరుమూసికొని యూరకుండుమనిన నూరకుండఁడు. (కాళునిదగ్గఱకువచ్చి—మెల్లగా) ఎంతచెప్పినను నీపాడుబుద్ధి మానవుగదా! (అని గ్రుడ్లనెఱ్ఱఁ జేయును)

కాళి—లేదుబాబో! నిన్నుసూత్తే బయమేత్తుంది.

మంత్రి—చాలు! నోరుమూయుము. (రాజుదిక్కు) రాజా! మన మూరక యే సంశయించుచుంటిమి. ఈవుగ్రాజ్యుఁడు రాభణ శబ్దముయొక్క యుత్పత్తి కీశ్లోకము చెప్పెను.

రాజు—ఏమని?

మంత్రి—"శ్లో. రకారో రావణేభాతి
కుంభకర్ణే విభాతి భః
విభీషణే ణకారోస్తి
రాభణో నచరావణః."

అనఁగా — పులస్త్యుని ముగ్గురు కుమారులలో మూడవవాఁడగు విభీషణుని పేరులో 'భ' కారమున్నది. రెండవవాఁడగు కుంభకర్ణుని పేరులో 'భ' కారమున్నది. మొదటివాఁడును రాక్షసశ్రేష్ఠుఁడునగు రావణుని పేరులో 'భ' కారము లేకుండుట భావ్యముకాదనియు రావణశబ్దములో మొదటనున్న 'ర' కారమును, కుంభకర్ణ శబ్దములోని రెండవ యక్షరమగు 'భ' కారము ను విభీషణశబ్దములోని తుదియక్షరమగు 'ణ' కారమును జేర్చి సంకేతముగ నుండునని 'రాభణ' శబ్దము నుపయోగించెను.

రాజు — అహా! ఆశ్చర్యమాశ్చర్యము.

విద్యాధరి — ఇతని భావంబులు దెలిసికొనుటయే దుర్ఘటముగానున్నప్పుడింక నేమని యీతనితోఁ జర్చించుదానఁ? కాని నాసంకల్పమునకుఁ దగిన మహనీయుఁడు దొరకుటచే నాభాగ్యమెంతని వర్ణింతును.

రాజు — (పుత్రికవంకఁజూచి) తనయా! విద్యాధరీ! ఈమహనీయుని పాండిత్యము నీతని వృత్తాంతముఁ దెలిసినదిగదా! ముందు నీయభిమత మెఱింగింపుము.

విద్యాధరి —

ఉ. బాల పయోజబాంధవుని ♦ భాతి వెలింగెడు సర్జితాంగ శో
భాలలితాంగ సంభవుని ♦ పావనభూసురవర్య సత్కళా
జాలము మోముపై వెలయు ♦ సర్వకళావిదునిన్ సరస్వతీ
లోలసమాను నీమనుజ ♦ లోకబృహస్పతినే వరించితిన్.

(అని తన మెడలోని ముత్యాలహారమును వానిమెడను వేయును)

ఇంక నీమహనీయునకు సకల విషయములందును విధేయురాలనై యుందును. నాయిష్టార్థమిఁక నెఱవేఱుఁగాక!

మంత్రి—(సంతోషముతో-తనలో) నేను గోరుచున్నదియు నదియే.

రాజు—మంత్రీ! పుత్రికయభిప్రాయము తెలిసినదిగదా! చిరకాలము నుండి యున్న నామనోవ్యధ నేటితో దీఱినది.

మంత్రి—నాకున్న చింతయు (కాళునిజూపి) నీమహానీయుని మూలమున నివారణమయ్యెను రాజా! నీపుత్రిక మహానీయురాలగుటచే మనకిట్టి మహాత్ముండు దొరికెను.

రాజు—సంతోషము. ఇంక వివాహప్రయత్నమొనరింతము. పుత్రీ! పోవుదము రమ్ము. (ఇద్దరు నిష్క్రమింతురు)

మంత్రి—ఓరీ! మూఢుండా! నీకెంతగా బుద్ధిచెప్పినను నీ వెఱ్ఱిబుద్ధి బయటఁబెట్టి నోటికివచ్చినట్లు మాటాడి నాకెంతయో కష్టము గల్గించితివి. (అని కొట్టును)

కాళి—అయ్యో! అయ్యో! యింక మాట్లాడను.

మంత్రి—అఱవవద్దు నోరుమూయుము. (అని మఱలఁగొట్టును)

కాళి—అయ్యబాబో! నీచోబనంవద్దు గీబనంవద్దు. నేనెల్లిపోతాలెండి (అని పోఁబోవును)

మంత్రి—(చేతినిబట్టుకొని) పోనీలే, రా. అఱవవద్దు, పోదమురమ్ము

(అని నిష్క్రమింతురు)

# మహాకవి కాళిదాస

## తృతీయాంకము

### 1. రంగము.

[శయనాగారమునఁ గాళుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కాళు — (శయనాగారమునందలి యలంకారములనుజూచి తెల్లవోయి) ఒరెరెరెరె యిదేమి సోద్దెమర్రో! యిదేమి చిత్రపటాల్రో! యిదేమి పువ్వులో — బలే కంపేత్తున్నాయ్ బాబో! యిదంతసూత్తె నాకు గాబరాయేత్తోంది (చుట్టునున్న యద్దములయందుఁ దన ప్రతిబింబమునుగాంచి) ఓస్ యీాళ్ళంతా ఓరసే। 'అరె! నాకుమల్లేనే ఉండారే! (అనినవ్వుచు) అరె! నేను నవ్వితే యీాళ్ళంతా నవ్వుతారేం! (చప్పట్లుకొట్టి) అరె యిదేంచిత్రం బల్ తమాసగుందే! నేనెట్టాయెట్టాసేత్తె, ఆళ్ళూ అట్టాగే సేత్తారేఁ—అబ్బో! యీాళ్ళంతా, దెయ్యాలో! యములాళ్ళో—యీాళ్లేంసేత్తారో నన్ను—ఈమంతరయ్య పెళ్ళిసేత్తారమ్మని తీసుకొచ్చి దుంపదెంపి యెట్టాగతేయేం పెళ్ళిచేసాడు (ఆలోచించి) (ఆయాళచూశానేఁ అదే నాపెళ్ళాంగామోసు. బలేసక్కందే! యీాడకొచ్చినన్నేమంటుందో—నాకేం భయమేత్తుందే ఈడెక్కడమంతరయ్యో! నన్ని గదిలోకినెట్టి తలుపేసి మాయాడు. (ప్రక్కకుఁజూచి) వహ్వా! బలే! యిట్టాటి పక్కమీాఁద,

నేను పండుకుంటా గామోసు- (ఆలోచించి) పండుకుంటే మంతరయ్యొచ్చి యేంతిడతాడో- యేం సెయ్యాను, నాగా కారంలాగుంది- (చుట్టునున్న ఫలహారములను జూచి ఓ! ఓ! యియ్యేదోవున్నాయే- యియ్యేగామోసు ఆగోళి దూడ్ పేడ, బత్తిపేడెట్టిత్తా బాగుంటయ్యన్నాఁడు అయితే కాత్తంత తినుసూత్తా- (తిని ఓస్ పేడతోసో కారనుకుండా బాగానేవుందే అని యువన్ని గబగబతినును) మంతరయ్య కొత్తేకొట్టేడుగాని కూత్తంత పక్కమీఁద కూడా బబ్బుని సూత్తా! [అని తలవైపు కాళ్లు కాళ్లవైపు తల పెట్టిపరుండి] బలే! రాజాలాగుండానశే- ఆయిగా నిద్దరొత్తుండద- బబ్బుంటాను [అనిపరుండగా నిద్రపట్టి—నిద్రలో దొర్లి క్రిందబడిగుఱక కొట్టుచుండును-]

[విద్యాధరి ప్రవేశించి గుఱకశబ్దమును విని అదరిపడి]

విద్యాధరి—ఏమి! యీభయంకరశబ్దము (ముందునకువచ్చిచూచి) అయ్యో! దైవమా! ఇది నానాథునిగుఱకయా! సర్వలక్షణ సంపన్నుఁడగు నితనికి గుఱకయుండుట చంద్రునకుఁ గళంక మువలెనేయున్నది. పోనిమ్ము- ఈతఁడు హంసతూలికాతల్ప మునువీడి నేలమీఁదఁ బరుండెనేల ? (యోజించి) సరి— తెలి సినది- గాఢనిద్రలోనున్న యీతనిని నాగానముచే మేలుకొ ల్పెదను- (అని పాడును)

కాళి—(నిద్రలో) సుబ్బా! గొఱ్ఱెలరుత్తుండయి, తోడేలేమోసుఁద్రా.

విద్యాధరి—ఇంకను మెలఁకువరాలేదు. ప్రాణనాథా! లెమ్ము! లెమ్ము!

కాళి—(నిద్రలో) పోపో! నిద్దరొత్తుంటే లెగమంటా- వోరనే!

విద్యాధరి—(తనలో) ఇదేమి! యిట్లు పామరభాషలో మాటాడు చున్నాఁడు. (ఆలోచించి) ఋష్యశృంగాది మహాజ్ఞాను లడవి

మ్మృగములవలెనుండలేదా? ఇందుదోషమేమి? కానిమ్ము! ఈ మలయజకర్పూర మిశ్రితగంధము నొకింత పీనిమీఁదజిలికి మేలుకొల్పెదను (అని గంధమును జిలికించును)

కాళి—(నిద్రలో) అరే సుబ్బా! గొత్తెల్నాతలికిఁతోలసే మూనుచ్చో త్తున్నయి.

విద్యాధరి—ఇదేమి! యిట్లు మాటాడుచున్నాఁడు మందద యీకర్పూరమిశ్రిత తాంబూలమును పీనినోటనుంచి మేలుకొల్పెదను. (వీగయమును బెట్టును)

కాళి—(ఉలికిపడియుమ్మి వేయుచు) ఓరెంకా! గొత్తెల్నవతలికి కొట్టమంటే కొట్టవేంరా! యీటితసాగొయ్యా! నోట్లోనే పెటికలేత్తున్నాయి.

విద్యాధరి—ఔరా! యీతనిమాటలే యర్థముగుటలేదు. మొన్నసభలో అశ్వసి, పునర్వసు, రాభణ మొదలగు భావగర్భితశబ్దములవలె నీమాటలకును నేదేని యర్థమున్నదా? లేక నన్నుఁ బరీక్షచేయువలెనని యిట్లు మాటాడుచున్నాఁడా? అయ్యో! యేదియును దెలియలేదే! ఈతని వినయపూర్వకముగాఁ బ్రార్థించెదను.

కం. సదయుఁడ! సకలకళాకో
విదుఁడవఁటని నమ్మినన్నుఁ ♦ బెండిలియాడక్
మృదులాలాపములాడవు
ముదమొసఁగునె యిట్లు నిద్ర ♦ మునిఁగినరమణా

నాథా! నన్నుఁబరీక్షించుచున్నారా?

చ. ధరఁగలపండితోత్తముల ♦ దర్పము నెల్ల హరింపఁజాలు నా
గరువము ఖర్వమైచనియెఁ ♦ గానఁ బరాజితురాల నాయెడన్
దిరిగి పరీక్షయేటికిఁ ద్వ ♦ దీయమనోగతముల్ మహాహ్యముల్
సరసవచోనిరూఢిని బ్ర ♦ సన్నుఁడవై దరిఁజేర్పువల్లభా.

నాథా! మీభావగర్భితములగు మాటలను విడిచిపెట్టి సరిగ మాటాడుఁడు.

కాళి—ఓశ్! యేంటేసాద! సిద్రోతుంటే.

విద్యాధరి—ప్రాణప్రియా!

కం. స్మరబాణాగ్నికిఁ జిక్కితిఁ
బరివేదనఁజెంది యింక ♦ బ్రతుకఁగఁజాలన్
గురుకరుణామృతవృష్టిని
గురిపింపఁగఁజేసి యేలు ♦ కొనుము మనోజ్ఞా!.

నేనింతప్రార్థించినను నిద్రపోవుచునేయుంటిరి. లెండు. మీ శీతలకరుణాకటాక్షములనాపైఁ బ్రసరింపఁజేయుఁడు. నేను మీ ప్రాణకాంతనగు విద్యాధరినిగాదా?

కాళి—(నిలచి యొడలు విఱుచుకొనుచుఁగనులు నులుముకొనుచు-సావలించి కన్నులు తెఱచిచూచి) ఓహో! నీవా! మరిగత్తె, అప్పుడే చెప్పలేదేం. నే నోరో అనుకుంఠా దా! కూకో!

విద్యాధరి—ప్రియా! రండు! మంచంమీఁదఁ గూర్చుండుము.

కాళి—ఇటురాలశే! మంచముమీఁదేకూకోవాలేంటి.

విద్యాధరి—(ఆత్మలో) అహా! ప్రియుఁడు వినోద ప్రియుఁడుగా నున్నాఁడే! (ప్రకాశముగా) నాథా! మీరు వినోదాలాప ప్రియులనియు రసికరంజనులనియు మొదటనే గ్రహించితిని.

కాళి—(కోపమున) యేంటీ! యేంటో అంటున్నావు. నేనేంగాదు.

విద్యాధరి—(ఆత్మగతము) ఇదేమి వినోదము? ఇట్లు మాటలాడు చున్నాఁడు. (ప్రకాశముగా) మనోహరా! మీ భావములు నాకర్థమగుటలేదు. క్షమింపుఁడు.

కాళి—(నలువైపులంజూచి యక్కడనున్న గంధపుగిన్నెనుదీసికొని) ఇదేంటి పానకమా?

విద్యాధరి— కాదు. (శ్రీగంధము (ఆత్మ) ఇతనినిజూచిన శుద్ధ పామరునివలెఁ గాన్పించు చున్నాఁడు. కాని మోమున మాత్రము బ్రహ్మతేజము తాండవ మాడుచున్నది. (ప్రకాశము) ప్రియా! ఏలయిట్లు మాటాడెదరు? మీపరిహాసములు చాలించి యిటురండు. ఈ శ్రీగంధమును బూసెదను.

కాళ— ఓశ్ యిదే-టో! గొల్లోళ్ళుయారూవ్రూసుకోరే. తలకాయ నెప్పిగావుంటే యేంటో యేసుకుంటూరు. యిదేనాయేంటి? అయితే నాకొద్దు నూయేపూసుకో.

విద్యాధరి—(ఆశ్చర్యమును దుఃఖమును) హా! దైవమా! ఈతఁడు గొఱ్ఱెల కాఁపరియాయేమి? యీతనిభాషయును; భావములును దదనుగుణములుగానే యున్నవి. మంత్రి మాత్సర్యముచే నన్నిట్లు మోసగించినట్లున్నది. ఇంకేమిగతి (కాళునిఁ జూచి) మీరెవ్వరు? నిజస్థితి చెప్పుడు? (అని బెదరించును)

కాళ—నాతితా, నీమొగుడ్నేగా! యేం తమాసాగావుండాయేంటి ఆయాల మంతరయ్య పెళ్ళిసెయ్యలా.

విద్యాధరి— (దుఃఖముననుచుకొని) మంచిది! మీరెక్కడనుండఁగా మంత్రి తీసికొని వచ్చినాఁడు.

కాళ—అదా! అయితే చెస్తాయినను. నేను ఆయాల మట్టమద్దాన్నం యెండలో యీ వూరిబయట అడవుందే! ఆ అడవిలో పెద్దకొండుందే! ఆ కొండపక్క డొంకలా? ఆ డొంకేమోతే పెద్ద మఱ్ఱిసెట్టోటుంది. దానికి సూటిగా మోతే సిన్న పల్లోటుంది అదేమావూరు. ఆ అడవిలో నేను గొఱ్ఱెలు కాసుకుంటూ ఆకులు కోస్తుంటే రాజుకూతుర్నిచ్చి పెళ్ళిసేత్తా వత్తావంట్రా అన్నాఁడు. యేందో అనుకోని, ఊఁ అన్నా. అదేంటేంటో సెప్పించి నన్ను సావగొట్టి యీాడకి లాక్కొచ్చి పెళ్ళిసేయించాడు.

విద్యాధరి— హా! దైవమా! (అని మూర్ఛిల్లును - కొంతవడికిఁ దెప్పిరిల్లి) అయ్యో! యెంతటి యవమానము జరిగెను? ఎట్టి దీనస్థితి సంభవించెను? ఇదంతయు మంత్రియొక్క కుతంత్రమేకదా! ఈతఁడవివేకముతో మాటాడిన మాటల నెల్ల దనచమత్కారముచే మంచి యర్థమును గల్పించి చెప్పి మమ్ము మోసగించెనే? హాతల్లీ? జగజ్జననీ! ఇప్పుడు నాగతియేమి? ఈపరిభవానల మెట్లు దహించివేయుచున్నది. చెప్పినమాటను జెప్పుకున్నఁ బ్రాణమును బోవునట్లున్నది. (అని దుఃఖించును.)

కాళి—ఎందుకూ యేడుత్తావు? నేనేంసక్కంగా లేనూ?

విద్యాధరి—అయ్యా ఊరకుండుడు, మిగులఁ జక్కగానున్నారు.

కాళి—అదిగాదే- యిందాక సక్కంగ కులుక్కుంటావచ్చి కూకోవే అంటంలోనే యేడుత్తావేం? అందరికిమల్లే నాకు కాళ్ళు, సేతులూ, ముక్కూ, తలా లేదూ?

విద్యాధరి—అన్నియునున్నవి-నేనపేక్షించిన విద్యాగంధము మాత్రమే లేదు.

కాళి—యేంటో సోబ.

విద్యాధరి—అయ్యో! యీ దుఃఖము నెట్లుభరింతును?

సీ. తల్లిదండ్రులయాన ♦ దాఁటి స్వతంత్రించి
పరిణయంబాడిన ♦ పాపఫలమొ!
బహుశాస్త్రములెఱుఁగు ♦ పండితోత్తములను
బరిభవించినయట్టి ♦ పాపఫలమొ!
పూర్వజన్మంబునఁ ♦ బొనరించు క్రియలచేఁ
బరిణమించినయట్టి ♦ పాపఫలమొ!
కుముదప్రియుఁడు తాను ♦ గుటిలత్వమువహించి
కావించినట్టిదు ♦ ష్కార్యఫలమొ!

గీ. కటకట! యస్వతంత్రురాలిఁ జేసి ♦ కడకు విషమునఁ
గ్రోలి వల్లు విరక్తుర ♦ కుక్షి నొకని
భర్తఁగాఁ గూర్చ్చెఁ బాడు దైవంబు ♦ వంబు నాకు
బ్రతుకఁగలనె యీదుఃఖ వా ♦ గాశిదాఁటి.

కాళ — యేందుకే! కడుపులో నొప్పా! వైద్యుణ్ణి పిలుచుకురానా?

విద్యా — వైద్యుఁడు నను వలదు — ఎవరు నను వలదు. మీరు కొంచెము దూర
ముండుఁడు. మిమ్ముఁ జూడఁ జాలను.

కాళ — అయితే! నేను బాగుండలా?

కీర్తన

1. ఈరుణ్ణి దీరుణ్ణి వారుణ్ణి నేనూ — నూ
కోరిన సుఖమూల కూరుతా నేనూ

2. లోకంబు లెల్ల గాలించిన గాని
నాకంటె సకాలనోరు యారూ తేరూ ॥యీరు॥

3. ఏడూపు సాలించి యికిలించు కల్కి-
జోడు చేతుల్ జేర్తూ చిలుకాల కోల్కి ॥యీరుణ్ణి॥

(అని పాడుచూ చేయి పట్టుకొనఁబోవును)

విద్యాధరి — (చేయి విడిపించుకొనుచు) నా దుఃఖమును పెంపు సేయ
కుఁడు. అయ్యో! సకలకళాపూర్ణుఁడగు రసికశిఖావతంసుని
బతిగాఁ బొంది సుఖము ననుభవింతునని యుప్పొంగుచుంటిని గాని,
యిట్టి మూర్ఖుఁడు భర్తయగునని కలనైనఁ దలంపలేదు. హా!
విధీ! హా! విధీ (అని మూర్ఛిల్లును)

కాళ — యిదేందిరా బాబో! యిల్లాపడిపోయిం దే! యింకేంగతి?
లగెత్తుకెళ్లి మావూళ్లో వైద్దుణ్ణి పిల్చుకురానా యేంటి (యోచిం
చి) పోతే మంతరయ్యేయేమంటాడో! మద్దినాకు సావొ
చ్చిందే.

విద్యాధరి—(మూర్ఛ దెప్పితిల్లి) అయ్యో! నాదుఃఖమునకు గంతు లేదుగదా! ఏమిసేయుదును. (ఆలకించి) ఛీ ఛీ! యెంత పాపముం జేయుచున్నాను. మనసార వరించి, యగ్నిసాక్షిగ వివాహమాడి యిప్పుడు విద్యావిహీనుఁడని తూలనాడి తిరస్కరించుచున్నాను. భర్త యెట్టి నీచుఁడైనను, దుర్మార్గుఁడైనను, కులహీనుఁడైనను, మూర్ఖుఁడైనను, సైవసనాముఁడని శాస్త్రములు దెల్పుచుండ శాస్త్రజ్ఞురాల నగు నేనే యిటు దూలనాడుచున్నాను. నాథా! క్షమింపుము. (అని కాళ్ళపైఁబడి లేచి) ఇప్పుడు చింతింపఁదగదు. చింతించిన లాభము లేదు. ఒకటే మార్గము. జగజ్జననియు, నాయిష్ట దేవతయగు కాళికాదేవింగూర్చి ధ్యానించి, యామెకృపా కటాక్షములచే నీతఁడు సకలశాస్త్ర పారంగతుఁ డగునట్లు ప్రయత్నించెదను. (కాళునిఁజూచి) నాథా! కాళికాలయము నకుఁ బోవుదమురమ్ము.

కాళ—సరిలే! యీ రాత్రికేనా? రేపుపోదాం లే.

విద్యాధరి—అట్లుకాదు. ఇప్పుడే మనమక్కడకుఁబోయి కాళికాదేవి యనుగ్రహమునుబొంది రావలయును.

కాళ—యేం. యెక్కడికోపోవాలిట ఉండు, కళ్ళోడుసుకున్నా తెన పట్టల్లా నీకిటి యెట్లాపోనేది.

విద్యాధరి—(ఆత్మగతము) ఈతనికి విధేయురాలనై మాటాడినచో నాపలుకులను లక్ష్యపెట్టి యీతఁడు దారికి వచ్చునట్లు లేదు. కావునఁ గొంచెము భయపెట్టి చెప్పెదను. (అని ఒక బెత్తము దీసికొని కొట్టఁబోవునట్లు నటించి) ఓయీ! నేను జెప్పినట్లు విని నావెంటవచ్చెదవా, లేదా? చెప్పుము.

కాళ—కొట్టకేవత్తాను. నువ్వెక్కడో మొగుడ్నే కొడుతున్నా యేం. నీయింటికాడ శాకిరిసేసే నౌకరుననుకున్నావాయేంటి? పెద్దమడుసులయింట్లో ఆడోళ్ళసేతికిచిక్కితే యింతేనాయేంటి,

విద్యాధరి—పిచ్చిపిచ్చిగాఁబలుకవద్దు. మెదలక నావెంటరావలయు
(అని బెదరించును)

కాళ—నీకు పున్నెముటుందిగాని పద. నాకెంతగాచారం పట్టిందిరా
యియ్యేళ. ఆ మంతిరయ్య సేతులోనుంచి తప్పించుకొని దీని
చేతిలో సిక్కానే నాకెంత గాశారం తెచ్చిపెట్టేడురా యీ
మంతరయ్య.

విద్యాధరి—ఓయీ! నిన్ను మంత్రి యెంకులకుఁగొట్టెను.

కాళ—యేం చెప్పను! ఆయాళ ఆదేంటో చెప్పించి పెళ్ళిచేస్తానని
తీసుకొచ్చి నేను గట్టిగా మాట్లాడితేసరి. కొట్టేవాడు.

విద్యాధరి—పాపమీతఁడు వట్టి యమాయకుఁడు. ఆనీచుఁడగు
మంత్రి యిట్టియనర్థమును దెచ్చిపెట్టెను. తనపుత్త్రిని నేను
బరిణయమాడలేదను క్రోధమున నిట్లుచేసెను. కానిమ్ము.
(కాళునిఁజూచి) ఆర్యా! మనము దేవాలయమునకుఁ బోవు
టకుముందు కాలుచేతులు కడుగుకొనవలయును.

కాళ—నిబుద్దిగానే? ఆయేళ యెప్పుడో గుళ్లోకెళ్తా కాళ్ళు కడు
క్కున్నా. అవును. (అని కాళ్లుకడిగికొనును)

విద్యాధరి—(ఆత్మగతము) ఈతనిచేత నాచమనముఁజేయించి మహా
కాళీమంత్రము నుపదేశించి, దేవిదర్శనమునకుఁ దీసికొని
పోయెదను. (ప్రకాశము) ఆర్యా! యీ జలముతో మూఁడు
పర్యాయము లిట్లాచమనముచేయుఁడు. (అని చేసిచూపును)

కాళ—ఓహో! అదా! మూనుసార్లు చేత్తో నీళ్ళు తాగటమా!
ఔను యెనకెప్పుడో చేత్తున్నట్టు గ్యాపకంవచ్చిది. అదేంటో
నోట్లో గొణక్కునేవాణ్ణి. అదేంటో నీకు తెల్సా.

విద్యాధరి— ఓహో! మీాకాచమనము చేసినట్టుకూడ జ్ఞాపకము
వచ్చినదా? (తనలో) శూద్రకులమునఁబుట్టిన వీని కాచమన

మనమేమి ? (ఆలకించి) ఏమో యీతండు బ్రాహ్మణుల సంజాతుం
డయ్యును గాలవశమునం బామరజనులలోం జేరి యీ విధ
ముగా మాటాడుట కలవడియుండవచ్చును. ఈతని ముఖ
తేజస్సునుజూచి సత్కులసంజాతుండనియు మహావిద్వాంసుం
డనియుం దలంపకతీరదు. లేదా యీతండు పూర్వజన్మ
మున నుత్తమకులమునంబుట్టిన యొక మహనీయుండై శాప
వశమున నిట్టిస్థితికివచ్చి యుండును ఆ పూర్వవాసనయే వీని
నిట్లు పలికించు చుండవలెను. ఏది యెట్లున్నను వీనియందు
మహాత్త్వమున్నట్లు తోంచుచున్నది. కాళికాదేవి మహిమ
వలన నాకు శుభము చేకూరవచ్చును. (అని యోచ
నము సేయుచు—మహాకాళీమందిరము నుద్దేశించి) నాథా!
యీ దేవాలయములోనికిం బోవుదమా ?

కాళి—నీవు బలేదానివలె వున్నావు. నిన్నుచూస్తే నాకు సంబరము
వుతుంది. నీవు యెట్టాసెప్తే నేనట్టా వింటా. ఇదంతా యెన్నోరో
జులకిందట నేమఱిచిపోయాను ఈనీళ్ళు తాగటం యిప్పాళనువ్వు
గ్యాపకంచేశావు. పొద్దున్న, మద్దేన్నం సందేళ యిట్టాగే
నీళ్ళు తాగుతూ దేవుణ్ణి మొక్కేవాణ్ణి. సగాదు యిప్పాళ
నీమూలంగా గ్యాపకంవచ్చింది. నీవు సాలా మంచిదానవు.
రా! పోదాము రా!

---

స్థలము—కాళీ దేవాలయము.

[విద్యాధరి కాళుండు ప్రవేశింతురు.]

విద్యాధరి—

సీ॥ శ్రీమహాకాళి యా ♦ శ్రిత భక్తజనపాళి
కల్హారపాణి శం ♦ కరుని రాణి

శ్యామలా[illegible] ◊ [illegible] మనోజ్ఞ
[illegible]
అంబా! [illegible]
[illegible] ప్రదాయి
శ[illegible]స్వరూపిణీ ◊ స[illegible]
[illegible] ◊ శైలతనయ

గీ. నాథునో[illegible] ◊ [illegible]
సకలభువనైక [illegible] ◊ [illegible]
దనయుగ్మ[illegible] ◊ [illegible]దాయి
యంజలిఘటించెదు సా ◊ ష్టాంగముగ.

(ఆలోచించు) ఓహో! ఇది స[illegible]గుటంజేసి, కాళి సంచారమునకుఁ బోయి యుండవచ్చును. ఆపె వచ్చులోపల నతనికింకఁ గొన్ని [illegible]లఁ జెప్పెదను. (కాళునిజూచి) ప్రాణేశ్వరా! కాళి యింకను గొంచముసేపటికిఁ గాని రాదు. ఈలోపల మీరు దేవాలయములోనికేగి తలుపులను బిగించుకొని నేఁజెప్పిన మంత్రమును జపించుచుండుఁడు. ఆపె వచ్చి తలుపు తీయుమనఁ జూచినన్ను విద్యాధరినిగఁ జేసినదోఁ దలుపుఁ దెఱచెదనని చెప్పుఁడు. అప్పుడాపె మీకువిద్యావరము నొసంగితినని చెప్పినమీఁదటఁ దలుపు తెఱవనగును.

కాళ—అట్టాగేసేత్తాగాని ఆకాళమ్మకు అన్నిదెలువచ్చా?

విద్యాధరి—ఆపె విద్యాస్వరూపిణి. ఆమెకు రాని విద్యయే లేదు. ఇంక మీరు లోపలికిఁబోయి తలుపు భద్రముగా వేసికొనుఁడు. (ఆత్మ) ఆవలకుబోయి నేనును దేవిని ధ్యానించుచుండెదను.

(అని పోవును)

కాళ—ఊఁ! అట్టాగే. ఇదిగో యిప్పుడేపోయి తలుపు బిడాయిస్తా చూడు! (ఆత్మలో) ఆమంతరిమ్మ సేతిలోసిక్కితే వాళ్ళ

వాసేటట్టుగా కొట్టేడు— ఈపుణ్ణాత్తురాలు సేతికిసిక్కినా అట్టాగే సేత్తే మెల్లగా తప్పించుకున్నానుగందా అనుకుండా— ఇంక కాళి వత్తుందట— అదేమి కాళో, గాలో, నాగాశారంవచ్చిందే— ఏమున్నా కాని లోపలకెళ్ళి తలుపు బిడాయించుకు కూకుంటా. ఆ కాళమ్మోరు లోపలుందా యేంటి ? కాళమ్మారో ! కాళమ్మారో ! (యని కేక వేశి) లేదు— యేడకో పోయుంది— (అని లోపలికిఁబోయి తలుపు వేసికొని కూర్చుండును.)

[ కాళికాదేవి ప్రవేశించును ]

కాళి—ఇదేమి! వాకిలిమూసియున్నది. (తలుపుకొట్టి) ఎవరులోపల?

కాళ—నేనే! కాళమ్మోరూ.

కాళి—నీపేరేమి?

కాళ—కాళ.

కాళి—తలుపు తెఱువుము.

కాళ—తెరవడానికీలులేదు.

కాళి—ఎందువల్ల?

కాళ—ఇదుగో, సూడు! నేనుసెప్పినట్టుగా నీవుసేత్తే తలుపుతీత్తా.

కాళి—(యోజించి. తనలో) ఈతని వృత్తాంతమంతయు గోచరమైనది. (ప్రకాశముగా) ఓయీ! అట్లులనేచేసెదను. ఏమి చెప్పెదవో చెప్పుము,

కాళ—యేంటంటే నీకు బలిద్దెలొచ్చునంట. నువ్వు మావూళ్ళో వున్న మారమ్మకంట సాలా గొప్పదానవంట. కామట్టించి యీ వచ్చనంలో యిద్దేలు, శాత్తరాలు, పురాండాలు, కైత్తాలు, అన్నీ నాకొచ్చేటట్టు శేశావంటే తలుపుతీత్తా, లేకపోతేలేదు.

కాళి—అలాగే కానిమ్ము! తలుపుతీయుము,

కాళ—అదెంతా పని [illegible]. తలుపుతీసింతరువాత పో! పో! అంటే సనేసెయ్యాలి, ముందునాకు యిద్దెలన్నీ వచ్చేట్టు సెయ్యి.

కాళి—(నవ్వుచు) ఓయీ! నీముఖమే చూడనిదే నీకు విద్య వచ్చునట్లు నేనెట్లు చేయుదును?

కాళ—యెట్టాగెగ్నా సెయ్యి నాకేం. నాకల్లా యిద్దెలన్నీ యీచ్చనంలో వచ్చేట్టు సేత్తేనే కాని తలుపుతీయను.

కాళి—అట్లైనచో నీవాకిలిగందునుండి నీనాలుకను బయటికిఁజాపుము, దానిమీఁద బీజాక్షరములను వ్రాసెదను. అప్పుడు నీవు సకల విద్యావిశారదుఁడ వయ్యెదవు.

కాళ—మఱి ఆనాట యిందాక నే సెప్తే కాదంటానూ, (అనినాలుకను జాచును)

కాళి—(బీజాక్షరములను గాళుని నాలుకమీఁదవ్రాసి) ఓయీ! నీనాలుకమీఁద నమృతబీజాక్షరములను వ్రాసితిని. నీవుసకల విద్యావిశారదుఁడవైతివి, ఇంకఁ దలుపు తెఱువుము.

కాళ—(వాకిలి తెఱచికొనివచ్చి కాళికి నమస్కరించుచు)

శ్లో॥ మాణిక్యవీణా ముసలాలయంతీం
మదాలసాం మంజుల వాగ్విలాసాం
మాహేంద్రనీలద్యుతి కోమలాంగీం
మాతంగ కన్యాం మనసాస్మరామి॥ 1.

శ్లో॥ చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమరాగ శోణే
పుండ్రేక్షుపాశాంకుశ పుష్పబాణ
హస్తే నమస్తే జగదేక మాతః॥ 2.

శ్లో॥ మాతా మరకత శ్యామా
మాతంగీ మధుశాలినీ
కుర్యాత్కటాక్షం కల్యాణి
కదంబ వనవాసినీ॥ 3.

శ్లో॥ జయ మాతంగ తనయే
జయ నీలోత్పల ద్యుతే
జయ సంగీత రసికే
జయ లీలాశుకప్రియే ॥ ౪.

దండకము

జయ జననీ, సుధాసముద్రాంతరుద్యన్మణి ద్వీపసంరూఢ బిల్వాటవీ మధ్యకల్పద్రుమాకల్ప కాదంబ కాంతార వాసప్రియే, కృత్తివాసప్రియే సాదరారబ్ధసంగీతసంభావనా సంభ్రమాలోల నీపస్రగాబద్ధ చూళీసనాథ త్రికే సానుమత్పుత్రికే శేఖరీభూత శీతాంశు రేఖా మయూఖావళీ నద్ధ సుస్నిగ్ధ నీలాలకశ్రేణి శృంగారితే, లోక సంభావితే, కామలీలాధను స్సన్నిభ భ్రూలతా పుష్పసందోహ సందేహకృల్లోచనా పంక కేళీల లామాభిరామే సురామే, రమే ప్రోల్లసద్వాలికా మౌక్తికశ్రేణికా చంద్రికా మండలోద్భాసి గండస్థలన్యస్త కస్తూరికాపత్ర రేఖా సముద్భూత సౌరభ్య సంభ్రాంత భృంగాంగనా గీత సాంద్రీభవన్మంద్ర తంత్రీస్వరే, భాస్వరే, వల్లకీవాదన ప్రక్రియాలోల తాళీదళాబద్ధ తాటంకభూషా విశేషాన్వితే, సిద్ధసమ్మానితే, దివ్యహాలామదోద్వేల హేలాలసచ్చక్షురాందోళన శ్రీసమాక్షిప్త కర్ణైక నీలోత్పలే, పూరితాశేష లోకాభివాంఛాఫలే, స్వేదబిందూల్లసత్ఫాలలావణ్యనిష్యందసందోహ సందేహకృన్నాసికా మౌక్తికే, సర్వమంత్రాత్మికే, కుంద మందస్మితోదార వక్త్రస్ఫురత్పూగ, కర్పూర తాంబూల ఖండోత్కరే, శ్రీకరే, కుందపుష్పద్యుతి స్నిగ్ధదంతావళీ నిర్మలాలోల కల్లోలసమ్మేళన స్మేరశోణాధరే, చారువీణాధరే, సులలిత నవయౌవనారంభ చంద్రోదయోద్వేల లావణ్య దుగ్ధార్ణవావిర్భవత్కంబు బింబోక భృత్కంధరే, మందరే, బంధురచ్ఛిన్న వీరాది భూషా సముద్ద్యోతమానా నవద్యాంగశోభే, శుభే రత్నకేయూరరశ్మిచ్ఛటా

పల్లవప్రోల్లసద్గోరకారాజితే, యోగిభిః పూజితే, విశ్వదిఙ్మండల
వ్యాప్త మాణిక్యతేజస్స్ఫురత్కంకణాలంకృతే, సాధుభిస్సత్కృతే,
వాసరారంభవేళా సముజ్జృంభమాణారవింద ప్రతిద్వంద్వి పాణి
ద్వయే, సంతతోద్యద్దయే, దివ్యరత్నోర్మికా దీధితిస్తోమ సంధ్యాయ
మానాంగుళీ పల్లవోద్యన్నఖేందు ప్రభామండలే, ప్రోల్లసత్కుండలే,
తారకారాజి నీకాశ హారావళిస్మేర చారుస్తనాభోగభారానమన్మధ్య
వల్లీ వలిచ్ఛేదవీచీ సముల్లాససందర్శితాకార సౌందర్య రత్నాకరే,
శ్రీకరే హేమకుంభోపమోత్తుంగ వక్షోజభారావనమ్రే, త్రిలోకా
వనమ్రే, లసద్వృత్తగంభీరనాభీ సరస్తీరశైవాల శంకాకర శ్యామరో
మావళీ భూషణే, మంజుసంభాషణే, చారుశింజత్కటీసూత్రనిర్భర్త్సి
తానంగ లీలా ధనుశ్శింజినీ డంబరే, దివ్యరత్నాంబరే, పద్మరాగోల్ల
సన్మేఖలా భాస్వరశ్రోణి శోభా జితస్వర్ణ భూభృత్తలే, చంద్రికా శీతలే,
వికసిత నవకింశుకాతామ్ర దివ్యాంశుకచ్ఛన్న చారూరుశోభా పరా
భూత సింధూరశోణాయమానేంద్ర మాతంగ హస్తార్గలే, శ్యామలే,
కోమలస్నిగ్ధ నీలోత్పలోత్పాదితానంగ తూణీర శంకాకరోద్దామ జం
ఘాలతే, చారులీలాగతే, నమ్రదిక్పాలసీమంతినీ కుంతలస్నిగ్ధ నీల
ప్రభాపుంజసంజాత దూర్వాంకురాశంక సారంగసంయోగ రింఖ
న్నఖేందూజ్జ్వలే, ప్రోజ్జ్వలే, దేవ దేవేశ, దైత్యేశ, యక్షేశ,
భూతేశ, నాగేశ, కోశేశ, వాయ్వగ్ని కోటీరమాణిక్య సంఘృష్ట
బాలాతపోద్దామలాక్షారసారుణ్యలక్ష్మీగృహీతాంఘ్రి పద్మద్వయే,
అద్వయే సురుచిరనవరత్న పీఠస్థితే, సుస్థితే, శంఖపద్మద్వయోపాశ్రితే,
ఆశ్రితే, దేవిదుర్గావటుక్షేత్ర పాలైర్యుతే, మత్తమాతంగకన్యా
సమూహాన్వితే, భైరవైరష్టభిర్వేష్టితే, దేవివామాదిభిస్సంశ్రితే,
లక్ష్మ్యాది శక్త్యష్టకాసేవితే, భైరవీసంవృతే. పంచబాణేన రత్యాచ
సంభావితే, ప్రీతిశక్త్యా వసంతేన చానందితే భక్తిభాజాం పరం శ్రే

యసే కల్పసే, ఛందసామోజసే భ్రాజసే, యోగినాం మానసే, ధ్యాయసే, గీతవిద్యానుయోగా వితృష్ణేన కృష్ణేన సంపూజ్యసే, భక్తిమచ్చేతసా వేధసా స్తూయసే, విశ్వహృద్యేన గద్యేన పద్యేన వాద్యేన విద్యాధరైర్గీయసే. యక్షగంధర్వసిద్ధాంగనా, మండలైర్మండితే, సర్వసౌభాగ్య వాంఛావతీభి ర్వధూభిస్సురాణాం సమారాధ్యసే. సర్వవిద్యా విశేషాన్వితం చాటుగాథా సముచ్చారణం కంఠ మూలోల్లసద్వర్ణ రేఖాన్వితం కోమలం శ్యామలోదార పక్షద్వయం తుండశోభాతి దూరీ భవత్కింశుకాభం, శుకం లాలయంతీ మివ క్రీడసే, పాణిపద్మ ద్వయేనా పరేణాక్షమాలా గుణస్ఫాటికే చేతసో సత్యజ్ఞాన సారాత్మకం పుస్తకం బిభ్రతీ యేన సంచింత్యసే తస్య వక్త్రాంతరాత్ గద్య పద్యాత్మికా భారతీనిస్సరేత్, యేన వా యావకాభాకృతిర్భావ్యసే, సోపిలక్ష్మీ సహస్రైః పరిక్రీడతే, కింనసిద్ధ్యే ద్వపు శ్శ్యామలం కోమలం చారు చంద్రావచూడాన్వితం ధ్యాయతః, స్తస్యలీలా సరోవారిధిః, తస్య కేళీవనం నందనం, తస్య భద్రాసనం భూతలం, తస్య గీర్దేవతా కింకరీ తస్యవాచాకరీ శ్రీస్స్వయం సర్వయంత్రాత్మికే, సర్వతంత్రాత్మికే, సర్వముద్రాత్మికే, సర్వశక్త్యాత్మికే, సర్వవర్ణాత్మికే, సర్వరూపే జగన్మాతృకే, హేజగన్మాతృకే, పాహిమాం, పాహిమాం పాహిమాం, పాహి॥

కాళి—ఓయీ! నీభక్తికి మెచ్చితిని. పూర్వము నీవు మహావిద్వాంసుండవు అగర్వమున గురువును దిరస్కరించి నాతనిచే బొందిన శాపవశంబున నిట్లింతవరకు నానాజన్మలలో దిరుగుచు వికటమూర్ఖుండవై బ్రాహ్మణకర్మములను విడచి శూద్రుని వలె జీవించుచున్నాడవు. తుదకా గురువు నీయెడ గరుణించి నీ ధర్మపత్నియగు విద్యాధరి మూలమున నీకు శాపవిమోచన కల్గునట్లనుగ్రహించెను. (కన్నులు మూయుచు) ఇప్పుడు

నీవు నీపూర్వవృత్తాంతమును జ్ఞాపకముఁ జేసికొనినచో నీకు విశదమగును. శాపగ్రస్తుఁడ వగుటచేఁ గర్మభ్రష్టుఁడ వైన దోషము నీకుఁ గల్గెను. ఇకముందు నీవుసద్బ్రాహ్మణుడవై కాళిదాస మహాకవియను పేరుతో జగద్విఖ్యాతిగడించి సుఖపడెదవు. ఇక నీయిష్టార్థ మేదేనియున్నచోఁ గోరుకొనుము.

కాళిదా—తల్లీ!

చ. నతులొనరించి నిగుణగ ♦ ణ స్తవముల్ దలపోయునన్ను స
త్కృతునొనరించి వాగ్విభవ ♦ ధీబలశేముషి గల్గఁజేసి మ
త్కృతులు జగత్ప్రశస్తి వహి♦యింపఁగఁ జేసి పఠించు యోగ్యతన్
సతతము నిల్పుమీ సకల ♦ శాస్త్రకదంబరో! కాళికాంబరో.

జననీ!! నీకృపాకటాక్షమున నా పూర్వవృత్తాంతమెల్ల జ్ఞప్తికివచ్చెను. నేను గురుదూషణకుఁ దగినఫల మనుభవించి నీమూలమున ధన్యుఁడనైతిని. తల్లీ! నిన్నెప్పుడు తలఁచుకొనిన నప్పుడు నీదివ్యదర్శనమొసంగి నన్నుఁగాపాడవలయునని కోరుచున్నాను.

కాళి—ఓయీ! కాళిదాసా! నీయిష్టార్థము నెఱవేఱుఁగాక. (అని యదృశ్యమగును)

కాళిదా—తల్లీ! నమస్కారము. (తిరిగి) అదిగో విద్యాధరి యీవైకే వచ్చుచున్నది. ఆపెనుగలిసికొనియెద [ముందునకుఁబోవును విద్యాధరి- యాలోచించుచుఁ బ్రవేశించును]

విద్యాధరి—నాభర్త కాళికాలయములోనికి వెళ్ళినమీఁద దేవిదర్శన మగువఱకు నక్కడనేయుండి యామెయనుగ్రహమును బడసెనో లేక చపలచిత్తుఁడై యెక్కడికేని వెడలిపోయెనో చూచెదను. (అని ముందునకు వచ్చును - కాళిదాసుఁడు ప్రవేశించి నమస్కరింపఁబోవఁగా విద్యాధరి వెనుకంజవేయును)

క్షణమునిల్వఁగఁజాల నన్ ♦ గౌఁగలింప
సెలవొసంగితిరమ్మ నా ♦ జీవితేశ !.

కాళిదా—విదుషీమణీ! నీకౌఁగలింపునకుగాదు. పోయివచ్చుటకు సెలవడిగితిని.

విద్యాధరి—అదేమట్లనెదరు ? ఎచ్చటికేఁబోయెదరు ?

కాళిదా—నాయిష్టమువచ్చిన చోటికిఁ బోవుటకు. నే నిక్కడనుండి యేమిప్రయోజనము ?

విద్యాధరి—నాథా! అర్థాంగినగు నన్నువిడచి యిష్టమువచ్చిన చోటికిఁ బోవుటయున నేమి ? ధర్మపత్నియొక్క ప్రార్థన నెఱవేర్చు ప్రయోజనముకాదా ? కావున

ఉ. ఎందఁగాని ప్రేమముక ♦ యించెను నేఁడిటులెల్ల విద్యలన్
మించినవాఁడవౌటఁ బస ♦ మించిన రూపసివౌట నిన్ను గా
మించి వరించు నన్ను ప్రు ద ♦ మేము కృపామతిఁ గౌగలింపమిన్
బంచశరాగ్ని కీలలకు ♦ భస్మము గానొకొ జీవితేశ్వరా!.

మనోహరా! నీవంటి కళావిశారదుని వివాహమాడవలయు నను నాసంకల్పము నేఁటికి నెఱవేఱె నేను ధన్యురాలనైతిని—నాయప రాధముల మన్నించి నన్ను గాపాడవలెను.

కాళిదా—

తే. తలప మంత్రప్రదాత్రియుఁ ♦ దల్లియగుటఁ
దనయుఁడనునేను నీవు నా ♦ తల్లివగుదు!
కాన నేతాదృశపువాంఛ ♦ మానివైచి
యఖిల దేశాటనమొనర్ప ♦ నాజ్ఞ యిమ్ము!.

విద్యాధరి—(చేయిపట్టుకొని) నీకుఁదల్లి మహాకాళిగాని నేనుగాను.

కాళిదా—(చేయి విడిపించుకొని) భవదుపదిష్ట మంత్ర ప్రభావంబు ననే కాళి సాక్షాత్కరించినది. గావున నీవును దల్లివే.

విద్యాధరి—(దెప్పులు మూసికొని) నాథా! ఏల యిట్లు మాటాడెదఁ
చెట్టఁబట్టిన ధర్మపత్నిని నీవిధమున నొంకిపెట్టుట న్యాయమా

కాళిదా—నీవు వరించినవాఁడు ధర్మజ్ఞుఁడా?

విద్యాధరి—నేను వరించినది మిమ్మేకదా.

కాళిదా—నీవు వరించినది పామరజనుఁడగు గొల్లవానిని. నేఁ
గాళిదాసుఁడను.

విద్యాధరి—ఆగొల్ల యే మీరుగదా?

కాళిదాసు—నా గొల్లజన్మము నీ మూలమున నివారణ మైనది
అందువల్ల నిప్పుడు నేను గొల్లవాఁడనుగాను, బ్రాహ్మణు
డను.

విద్యాధరి—సత్యమే! స్థితిమాత్రము మాఱినదిగాని వ్యక్తిమాఱ
లేదుగదా?

కాళిదా—శాపగ్రస్తుఁడై పామరులలోఁ జేరి కర్మభ్రష్టుఁడై మూఁ
న్యుఁడై యున్నవానిని వరించిన తరుణి బ్రాహ్మణుఁడనై
నన్నుఁ గోరఁదగునా? మఱియు నొకవేళ నా నిజజన్మమున
దొలఁగించి మహాకాళి యనుగ్రహ పాత్రునిగాఁ జేసి నాకు
విద్యాప్రదానముఁ జేసిన నిన్ను నేను బత్నిగా భావింపదగునా!

విద్యాధరి—మనోహరా! మీకుఁ జేసిన యుపకారము మహోపకార
ముగా మాఱినదే! భర్త యనర్థుఁ డైని వానికి హితము
బోధించి యేలుకొనుట స్త్రీలకు ధర్మముగదా! కావున
నన్ను విడనాడఁ దగదు లేనిచో ధర్మపత్నిని త్యజించిన పాపము
మీకుఁ దగులదా?

కాళిదా—ఈజన్మమున నేను నిన్ను వరింపను లేను త్యజింపను లేదు.

విద్యాధరి—నాథా! యేల యిట్లనెదరు?

సీ. భూసుర వంశోద్దీపక!
గాసిం బెట్టకుము నన్నుఁ గరుణాళువవై

దాసిఁగ నేలు కొనంగదె
భాసురగుణసదన! రూప ♦ వంచితమదనా!

(అని కాళ్లపైఁబడును)

కాళిదా—ఇకనన్ను నిర్బంధింపకుము. నేను వెడలిపోయెదను. (అని నిష్క్రమించును)

విద్యాధరి—హా! ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! నన్ను విడచి పోయెదరా! న్యాయమా! అయ్యో! అయ్యో! ఛీ! యింక నా బ్రతుకెందులకు? (అని మూర్ఛిల్లును. కొంతసేపటికి లేచి) హా! జగజ్జననీ! కాళీ! ఇకముందు నాగతియేమి? నీవుచూపిన యనుగ్రహమే నాకనర్థకారిగాఁ బరిణమించినది. లోకైకవిద్యాధరియగు విద్యాధరికిఁ దలవంపు ఘటిల్లునట్లు చేసితివనుకొంటిని. కాని మంత్రి కుతంత్రములచే నాకుఁ గావించిన మహాపరాభవమునకుఁ దగిన పరాభవమె మంత్రికిఁ గల్గునట్లు నానాథుని నీమహాప్రసాదమున విద్యాసనాథుని జేసితివి కాని యేమిలాభము! చివరకు ముల్లుదీసి కొఱ్ఱడిచి నట్లయ్యెను. అయ్యో! అయ్యో! బహు ప్రయాసముచే లభించిన నాప్రాణకాంతుఁడు నన్నుఁబాసిపోయినచో నింక నేనీ ప్రాణంబుల నెట్లు నిల్పుదును? నా సుఖదుఃఖములకుఁ గారణభూతురాలగు నామహాకాళి పాదకమలముల యందే, నాప్రాణముల విడచెదను. (అని గుప్తఖడ్గమును దీసికొని) ఓ జననీ! మహాకాళీ! నాభర్త తిరిగివచ్చి నాకుఁ బరిష్వంగ సుఖమొసంగి నన్నేలుకొనునట్లు చేయవేని నీ పాదకమలము లకు నాప్రాణము లర్పించి నీలోఁ జేరుచున్నాను. (అని పొడుచుకొనఁ బోవఁగా)

(తెరలో)

కాళి—విద్యాధరీ! నిలు నిలుము. సాహసము వలదు. నీకు శుభము కాఁగలదు. నీపతి నీకు ధారానగరమున లభింపఁగలఁడు. నీవు వేషాంతరమున నచటికిఁబోయి యతని బొందు ప్రయత్నమును జేయుము. ఆతఁడు నిన్నుఁ జేపట్టువఱకును నిన్ను గుర్తింపకుండునటుల వరమిచ్చితిని.

విద్యా—హాతల్లీ! మహాప్రసాదము. నీ వాక్యములమృతోపమానములు. నీయాజ్ఞాప్రకారము పురుషవేషమున ధారానగరమునకుఁబోయి నాభర్త యనుగ్రహమును బడయఁ బ్రయత్నించెదను.

(అని నిష్క్రమించును)

(తెరపడును)

# మహాకవి కాళిదాస

## చతుర్థాంకము

### 1 వ రంగము

[ధారానగరములో నాస్థాన ద్వారమునఁ గాళిదాసుఁ డాస్థాన కవియగు నేకసంధాగ్రాహితో మాటాడుచుండును]

కాళి—అయ్యా! రాజదర్శనార్థమై వచ్చితిని. లోనికిఁ బోనిచ్చెదరా?

ఏకసంధాగ్రాహి—మీ రెవరు? ఎందునిమిత్తమై రాజుగారిని దర్శింపఁ గోరుచున్నారు?

కాళి—అయ్యా! నేను గాశ్మీరదేశ వాసుఁడను. బీదబ్రాహ్మణుఁడను. కుమార్తె వివాహము నిమిత్తమై మీ రాజుగారిని యాచింప వచ్చితిని.

ఏక—మా రాజు కవులకుఁగాని తదన్యులకు దర్శన మొసంగఁడే?

కాళి—అయ్యా! మీదయ యుండవలయును గాని కవినైన నేమి? కాకున్న నేమి? యెవరో గొప్పకవియఁట. అతఁడు కొలఁది దినములనుండి రాజదర్శనార్థమై యీపురంబునం దున్నను, రాజదర్శనము కాలేదఁట.

ఏక—ఆతనిని దా మెక్కడఁ జూచినారు?

కాళిదా—ఈ యూరిలో సత్త్రముననున్నాఁడు. నేనుగూడ నా సత్త్రముననే దిగియున్నాను. ఆతఁడు తనవృత్తాంతమును

దెల్పి, నిన్నెవ్వరు రానిత్తురయ్యా యనఁగ నాయదృష్టమెట్లు న్నదో కానిప్పుడు గంపెడాసతో వచ్చితిని.

ఏక—అవును! మహాకవులను మాత్రమే రాజదర్శనార్హులఁ జేసెదము. సామాన్యకవుల నిటనున్న యేకసంధాగ్రాహి నగు నేనును, ద్విసంధాగ్రాహియగు మా తమ్ముఁడును పరీక్షచేసి తగిన బహుమానముల నొసంగి పంపెదము. అట్లు నీవు పూర్వకవుల శ్లోకములను దొంగిలించి చెప్పుటచే నాయొద్ద రాజదర్శనము కుదురఁగలేదు. కావున నీవు గర్వము గాకున్నచో రాజదర్శనము కాఁగలదు.

కాళిదా—అయ్యా! నేనును మహాకవిని గాఁబోను. నేదో కొద్దిగాఁ గవిత్వము చెప్పఁగలను. మహాకవిత్వ ప్రసక్తము కొఱకై నేను రాలేదు. నాకు దయచేసి రాజదర్శనముఁ జేయించినచో మీకుఁ బుణ్యముండును,

ఏక—నీవు కవివైనచో నొకశ్లోకమును జెప్పు. చూతము.

కాళిదా—అయ్యా! నాకవిత్వమంత పరీక్షింపఁదగినదిగాదు. ఏదో మీరలడుగుచున్నారుగానఁ జెప్పెదవినుఁడు.

శ్లో. అస్తివద్బకవద్బైవ । చల్లవద్భల్లుకస్య వత్
రాజతే భోజతేకీర్తిః । పునస్సన్యాసి దంతవత్.

ఏక—(తనలో) ఈతఁడు వట్టియుగ్రుఁడు. కానిచో నిట్టి హీనోపమలు నాంధ్రశబ్దముల చేరికయునుగల శ్లోకముఁ జెప్పునా? రాజుచే వీనికిఁ బరాభవముతప్పదు. కవులను బిలుచుకొని రాలేదని మమ్ముఁ బలుమాఱు దూఱుచున్న రాజు వీనిని గాంచె నేని యింక మాటాడఁడు. కావున వీనిని రాజునొద్దకుఁ బంపెను. (ప్రకాశముగా) అయ్యా! మీ యదృష్ట మెట్లున్నదో! లోపలికిఁబొండు.

(నిష్క్రమింతురు)

2వ రంగము.

(భోజరాజు కవుల సమేతుఁడై సింహాసనమందుండును)

కాళిదా—(రాజును జూచి)

శ్లో. మహారాజ శ్రీమన్ జగతియశసా తే ధవళితే
పయఃపారావారే పరమపురుషోయం మృగయతే
కపర్దీ కైలాసం కరివరమభౌమం కులిశభృత్
కళానాథం రాహుః కమలభవనో హంసమధునా.

భోజ—(అశ్వశిక్షకునకుఁ బ్రక్కకుఁ దిరుగును)

కాళిదా—ఓహో!

శ్లో. విద్వద్రాజశిఖామణే! తులయితుం ధాతా త్వదీయం యశః
కైలాసంచ నిరీక్ష్య తత్రలఘుతాం నిక్షిప్తవాన్ పూర్తయే
ఉక్షాణం తదుపర్యుమాసహచరం తన్మూర్ధ్ని గంగాజలం
తస్యాగ్రే ఫణిపుంగవం తదుపరిస్ఫారం సుధాదీధితిం.

భోజ—(వేఱొకప్రక్కకుఁ దిరుగును)

కాళిదా—ఆహా!

శ్లో. నీరక్షీరే గృహీత్వా నిఖిలఖగతతీర్యాతి నాళీకజన్మా
తక్రంధృత్వాతు సర్వానటతి జలనిధీంశ్చక్రపాణిర్ముకుందః
సర్వానుత్తుంగ శైలాన్ దహతి పశుపతిః ఫాలనేత్రేణపశ్యన్
వ్యాప్తా త్వత్కీర్తికాంతా త్రిజగతి నృప భోజో రాజక్షితీంద్రః

భోజ—(మఱొకప్రక్కకుఁ దిరుగును)

కాళి—

శ్లో. స్వర్గాద్గోపాల! కుత్రవ్రజసి? సురమునే! భూతలే కామధేనో
ర్వత్సస్యానేతు కామ స్తృణచయ మధునాముగ్ధ దుగ్ధం న తస్యాః?
శ్రుత్వా, శ్రీభోజరాజ ప్రచురవితరణం వ్రీడ శుష్కస్తనీ సా
వ్యర్థోహాస్యాత్ప్రయాసస్తదపి, తదరిభిశ్చర్వితం సర్వముర్వ్యాం.

భోజ—(సింహాసనమునుండి లేచి) మహాత్మా! నమస్కారము.

కం. భారతి కావ్యామృతఫల
సారంబెఱుఁగంగ సర్వ ♦ సామాన్యంబే
యారయ సత్కవియొకనికి
ధారుణినిను బోలునట్టి ♦ ధన్యునికివినా.

మహానుభావా! నీ యమృత కవితామాధుర్యమున కచ్చెరు వొంది పారవశ్యుఁడ నైతిని. తాము సాక్షాత్సరస్వత్యవతారమై యుండవలయును గాని సామాన్య మానవునిగా దలంపను. దయచేసి తమ నామమునఁ గల పవిత్రాక్షరములఁ దెల్పి శ్రవణోత్సవము గావింప వేఁడుచున్నాను. మఱియు,

ఉ. శ్లోకచతుష్టయంబుఁ గడు ♦ చోద్యమిదంబులు గూర్చుచుంటచే
నాకమనీయ రాజ్యమును ♦ నాలుగు దిక్కులు సక్రమంబుగా
నీకొసఁగినాఁడఁ గదు ♦ లేచి గ్రహించుము రత్నపీఠిపై
నోకవిసార్వభౌమ యిఁక ♦ నుండి సుఖంబుగ రాజ్యమేలుమా.

కాళి—బాగు! బాగు! రాజా యిది యేట్టి దానము. అపాత్రదానంబనుచితంబని కదా బుధులు నుడువుదురు. యతి కప్పరస హొందవలె బ్రాహ్మణునకు రాజ్య మెందులకు? షడ్రసోపేతంబుగ భోజనమిడుము. కనకమణిమయ వస్త్రవాహనంబులొసంగి పూజించి సత్కృతుల రచింపఁ బురికొల్పుము. మఱియు,

మ. అనఘా! మీరెఱుంగరే "సుకవితా ♦ యద్యస్తిరాజ్యేనకి"
మ్మను నార్యోక్తిని గాన సత్కవి తపో ♦ ధ్యానైక నిష్ఠాత్ముఁడై
వినుతప్రాభవ శౌర్యధైర్య బలగాం ♦ భీర్య ప్రతాపాఢ్యులౌ
మనుజాధీశుల రాజ్యమేలఁగలఁ డే ♦ మాడ్కిన్ ధరాపాలకా.

ఇఁక నేనెవరనియా?

గీ. అఖిల జగములనేలు లోక ◊ కైక జనని
కాళికాదేవి పాదపం ◊ కజయుగళంబు
నిత్యసంసేవన వ్రత ◊ నిరతిగల్గు
కాళిదాసుండ నేను భూ ◊ పాల చంద్ర.

భోజ—మహాత్మా! ధన్యాత్ముండను. మీరు వచించిన నాల్గుశ్లోకములకు నాల్గుదెసలు మీకిచ్చి వేయుటచే నేని సింహాసనమునఁ గూర్చుండుట కనర్హుండఁ గావున దానధిష్ఠింపుండు.

కాళి—రాజా! ఇట్టిదానము మహాత్మాటికిని నేను బరిగ్రహింపఁజాలను. నాయందు చేసి తృప్తిగాంచి నీవీ రాజ్య మర్పించుచుంటివో యాశక్తిని లోకోపకారమునకై వినియోగించు పదవి నిమ్ము. ఇట్టిదియ నాజనని యాజ్ఞ యగుటచే నీయొద్ద కరుదెంచితిని.

భోజ—మంత్రీ! బుద్ధిసాగరా! యీ మహనీయుండెంత చెప్పినను వినకున్నాఁడు. పరిత్యక్త రాజ్యము నెట్లు తిరిగి పరిగ్రహింతును?

బుద్ధి—రాజా! నాబుద్ధి కొకటి తోఁచుచున్నది. ఈ కవిసార్వభౌముని కశేషంబుగా ధనమొసంగి యీరాజ్యమును దిరిగి కొనినట్లు నీరాజ్యమును నీవు గ్రహింపుము.

భోజ—మంత్రి! నీవు నిజముగా బుద్ధిసాగరుఁడవే. నీయూహయెంతయు బాగుగనున్నది. లోనికింబోయి ధనము గొనిరమ్ము.
(మంత్రిపోయి ద్రవ్యముతో వచ్చును)

భోజ—కవీంద్రమా! యీరాజ్యము నీకక్కరలేకున్నచో నేనొసంగు ద్రవ్యమున కారాజ్యము నాకిమ్ము.

కాళిదా—అటులనే కానిమ్ము. (అని ద్రవ్యమును బరిగ్రహించుచున్నాఁడు)

భోజు—(తిరిగి సింహాసనమునఁ గూర్చుండి) కాళిదాస మహాకవీ! నీవు కవి సార్వభౌముఁడవగుటచే నా యర్ధాసనంబునఁగూ

అయిఖలు విషమః పురాకృతానాం
భవతిహిజంతుషు కర్మణాం విపాకః.

భోజ—(ఆలకించి) బాణకవీ! ఏమంటివి? పవిత్ర కులములోఁబుట్టిన సీతాదేవి యెక్కడ? రాక్షసునితో నున్నదను నపవాద మెక్కడ? ఇదే జన్మాంతర కర్మ పరిపాకము యొక్క ప్రారబ్ధమనియేగదా! నీభావము. కాని సీతాదేవి రాక్షసునితో నున్నదను స్థలమున ధ్వనిదోషమున్నదనుమా! పవిత్రురాలగు సీతాదేవి విషయములో నీ ప్రయోగము యోగ్యముగా లేదు. (భవభూతినిజూచి) భవభూతీ! నీవేమి చెప్పెదవు?

భవభూతి—రాజా!

శ్లో. క్వజనక తనయా? క్వ రామజాయా?
క్వచదశకంధర మందిరే నివాసః?
అయిఖలు విషమః పురాకృతానాం
భవతిహిజంతుషు కర్మణాం విపాకః.

భోజ—భవభూతీ! ఇదియు నాకంత ప్రశస్తముగాఁ దోఁపలేదు ఏమనఁగా జనక మహారాజునకుఁ గూఁతురగుట యెక్కడ? రామునకుఁ బత్నియగుట యెక్కడ? అట్టిసీత రావణాసురుని యింటనుండుట యనఁగా నెట్టిది. ఇది జన్మాంతర ప్రారబ్ధ పరిపాకముసుమా యనియేకదా! నీ తలంపు. సీతాదేవి యశోకవనమునందుండెను గాని రావణునియింట నుండలేదు. (తనలో) కాళిదాసుఁడేమి చెప్పునో చూచెదను. (ప్రకాశముగా) కాళిదాసకవి చంద్రమా! యిందలి కవిహృదయమును నీవు దెల్పుము చూతము.

కాళిదా—రాజా!

శ్లో. శివశిరసి, శిరాంసియాని రేజు
శ్శివశివ! తాని లుఠంతి గృధ్రపాదైః
అయిఖిలు నిపమః పురాకృతానాం
భవతిహి జంతుషు కర్మణాం విపాకః.

భోజ—ఆఁ! ఇది త్వ ప్తికరముగా నున్నట్లున్నది. ఏమంటివి? యే రావణుని తలలు సంధ్యా శివపూజాసమయమున శివుని తలపై నర్పింపఁబడి ప్రకాశమానముగా వెలింగెనో యా తలలు గ్రద్దల కాళ్ళక్రిందఁ ద్రొక్కఁబడి పొర్లాడుచున్నవి. అయ్యో! ఇదియేకదా జన్మాంతర పరిపాక మహిమ! చక్కఁగా సరిపోయినది. కాని వారిద్దఱు జెప్పినభావము, నీభావమునకు విపరీతముగా నున్నది. ఇందు నిజమేదియో తేలవలెను.

బాణకవి—రాజేంద్రా! శిలమీఁదనున్న పాఁచిని శుభ్రముగా గీకిఁచినచో శ్లోకముయొక్క పూర్వార్థము గోచరించును.

భోజ—అవును! అటులనే చేయుంతము (సేవకుని దిక్కై) ఓరీ! ఈ ఱాతిని శుభ్రముచేసి తీసికొనిరండు.

సేవకుఁడు—చిత్తము! (అని ఱాతిని శుభ్రపరచి యిత్తురు)

భోజ—(ఱాతిని దేరిపాఱఁజూచి) ఆశ్చర్యము! కాళిదాస మహా కవీ! నీ ప్రతిభ యద్భుతముగా నున్నది. (బాణునిజూచి) బాణకవీ! యీ శిలమీఁది పూర్వార్థశ్లోకమును జదువుము!

బాణ—(శిలను జూచి)

శ్లో. శివశిరసిశిరాంసి యాని రేజు
శ్శివశివ! తాని లుఠంతి గృధ్రపాదైః.

ఈ మహానీయుఁడు చెప్పినటులనే యున్నది. ఈతఁడీ శ్లోకము నిదివఱ కెక్కడనేని వినియుండెనా? కాదు కాదు. ఈతఁడు తప్పక సరస్వతీ దేవ్యవతారమై యుండవలెను.

బ్రాహ్మణు—(ఆత్మ) నవ్విదానా వేదిమో యెఱుంగక కేవల
నేనాభ్యాసము మొనర్చిన మేము దీనికేమి ప్రత్యుత్తర మొసంగ
వలెను. (ఊరకుందురు)

భోజ—కవిశ్వరులారా! బ్రాహ్మణులకు నేనేమి బహుమతి యొసం
గెదను?

కాళిదా—(ప్రీతముఖుండై చిఱునవ్వుతో) మానుము. ఈ అత్యాశతో వచ్చిన
యీభూసురుల కాశాభంగ మాయెను. (యోజించి) కాని
యున్న! కొంచెము చమత్కారము చేసెదను. (రాజునుజూచి)
రాజా! ఈ బ్రాహ్మణులు కవిత్వము చెప్పవలెనని యుద్దే
శ్యముతోడనే శ్లోకము యొక్క మొదటిపాదమునే యారం
భించినారు. అప్పుడు తాము 'చాలు జా' లని గద్దించుటచేఁ
జివర పాదమును గూడఁజెప్పి యూరకుండిరి.

భోజ—కవిచంద్రా! నీవును బహుచక్కఁగా మాటాడుచున్నట్లు
న్నదే! ఇవి వేదవాక్యములు గావా?

కాళిదా—మధ్య రెండు పాదములుకూడ చెప్పిచో నవి యెట్టి వేద
వాక్యములో తమకే తెలియఁగలదు. కాని యీ బ్రాహ్మ
ణులిప్పుడు భయపడిపోయిరి. కవి హృదయమును గ్రహించి
చెప్పుమనిన నేనా శ్లోకమును బూర్తిచేసెదను.

భోజ—ఏది! చెప్పుము.

కాళి—శ్లో. 'అణోరణీయాన్ మహతో మహీయాన్'
మధ్యం నితంబశ్చ యదంగనాయాః
తదంగ హారిద్ర విమృజ్జనేన
యజ్ఞోపవీతం పరమం పవిత్రం.

భోజ—(నవ్వి) కాళిదాసకవివర్యా! యెంతో చమత్కారముఁ జూపి
తివి. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అనఁగా భగ

వంతుఁ డత్యంత సూక్ష్మముగను నత్యంత స్థూలముగను నుండు నని చెప్పు వేదవాక్యములను మీ చమత్కారముచే శృంగార భావమును గల్పించుచు నీసుందరియొక్క నడుమత్యంత సూక్ష్మమో, పిరుదులత్యంత స్థూలమో, యటువంటి స్త్రీ శరీరము నున్న పను నీ పురుషుని యజ్ఞోపవీతమున కంటుకొనునో యదియే పరమపవిత్రమైనదియని 'యజ్ఞోపవీతం పరమం పవిత్ర'మ్మను యజ్ఞోపవీత ధారణమంత్రమునకు విపరీతార్థమును గల్పించిన నీకు సమానులెవరు? ఏరి కారణమున నీ చమత్కారముఁ జూపి నాకానందమును గల్గింపజేసితివో యా విప్రులకు బహుమతి నొసంగుచున్నాను. మంత్రీ! యీ బ్రాహ్మణులకిద్దఱకును జెరియొక వేయి వరహాలనిమ్ము.

బుద్ధి—చిత్తము.

సేవ—దేవా! జయము గుఁగాక! కృష్ణశర్మయను బ్రాహ్మణోత్తముఁ డొకఁడు తమ దర్శనార్థమై వేచియున్నాఁడు.

భోజ—లోనికిఁ గొనిరమ్ము!

సేవ—చిత్తము! (అని పోయి బ్రాహ్మణునితో వచ్చును)

కృష్ణశర్మ—(ప్రవేశించి తనలో) లోకములో దారిద్ర్యదోషము కన్నఁ జెడ్డది లేదు. రాజసన్నిధికి, రిక్తహస్తములతోఁ బోఁ గూడదని చెప్పుదురు. ఒక ఫలమేనియుఁ దెచ్చియిత్తమన్న దానికిని శక్తిలేదుగదా? ఏవియో నాల్గు చెఱకుతుండ్లు దొరికిన వానినిమాత్రము తీసికొనివచ్చినాను. ఇవియే తేనికి సమర్పించి యాశీర్వదించెదను. (సమీపించును)

భోజ—పూజ్యులకు నమస్కరించుచున్నాను.

కృష్ణశర్మ—కళ్యాణమస్తు. (కొంగునఁ గట్టుకొనిన చెఱకుతుండ్లను దీసి రాజునకు సమర్పింపవలెనని విప్పఁగా నవి కట్టెపుల్లలుగా

నున్న వి-తనలో) అయ్యో! యింకేమిగతి! నేను దెచ్చిన చెఱకు తోండ్లను దారిలో నుండి యూడదీసి బాలురెవ్వరో యపహరించి యీ కట్టెపుల్లల సంచుం గట్టియుందురు. ఇప్పుడేమి చేయుదును ?

భోజ—(కోపమున) ఓయీ! బ్రాహ్మణుడా! యేమి యీ తెలివి తక్కువ? ఇది రాజాస్థానము తెలియదా? ఇక్కడికి నీవు కట్టెపుల్లలం దెచ్చిన కారణ మేమి? భయభక్తులు లేక యెవరిని గాల్చుటకుం దెచ్చితివి?

కృష్ణశర్మ—(వణకుచు నిల్చియుండును)

కాళి—(తనలో) గోరుచుట్టుపై రోకటిపోటువలె నీతనిని దారిద్ర్య మొకటి బాధించుచుండ రాజుయొక్క కోపమింకొకటి యధిక మయ్యెను. రాజానుగ్రహమునకై వచ్చిన వీనికి రాజాగ్రహము లభించెను. పాపము! దురదృష్టవంతుడు (రాజును జూచి) రాజా! కోపముపసంహరింపుము. ఈతండు మహానుభావుండు, ఇతని భావము వేఱు. మీ రాజాగ్రహమునకు భయపడి నిలచియున్నాడు. అతండీ యింధనములు తెచ్చిన కారణము నేను జెప్పెద.

భోజ—అతని యుద్దేశ్యమేమి ?

కాళి—

శ్లో. దగ్ధం పంచశరః పినాకధనుషా కేనాప్యయుక్తం కృతం
దగ్ధం ఖాండవ మర్జునేన చవృథా దివ్యద్రుమైర్మండితం
దగ్ధా రావణపాలితా హనుమతా దివ్యా చ లంకాపురీ
దారిద్ర్యం బహుదుఃఖకారి జగతాం కేనాపి దగ్ధం నతత్.

భోజ—కాళిదాసకవివర్యా! నన్ను క్షమింపుము. కవియనినీకే తగును. ఏమీ! పరమేశ్వరుడు మన్మథుని, నర్జునుడు ఖాండవవనమును,

నాంజనేయుఁడు లంకా ప్రవేశమునకు [illegible] ప్రఖ్యాతివడసిరి
గాని సర్వలోకములకును దుఃఖభాజనమగు నీ దారిద్ర్యము
నెవరును దహింపలేరు. [illegible] దారిద్ర్యమును
దహింపజేయుటకు నాకే తగినశక్తి గలదని యెంచి యీ ధనముల
నా చేతి కిచ్చుచున్నాఁడనియా! [illegible] చాతుర్య
ముతో నీరీతిగాఁ గవిత్వము జెప్పఁగల శక్తి నెవ్వరు కొనియా
డుదురు. నీవు మదాస్థానమున నుండదగిన యోగ్యుఁడవు. వాని
యభిప్రాయ మెట్లున్నను [illegible] భూసురుని
దారిద్ర్యమును నాశన మొనర్చెదను. సద్గుణుఁడగు బ్రాహ్మణుని
నీ దగోపించినందులకు మన్నింపుము. (మంత్రితో) మంత్రీ!
ఈ విప్రోత్తమునకుఁ బదివేల వరహాల బహుమానముగా నిచ్చు
శాసనమును వ్రాసియిమ్ము!

మంత్రి—చిత్తము– (వ్రాసి రాజముద్రను వేసి యిచ్చును)

(తెరలో వైతాళికుల హెచ్చరిక)

భోజ—ఓహో! సాయంసమయమయినది. వైతాళికులు హెచ్చ
రించుచున్నారు. సభ చాలింతము.

శ్లో. 'పరిపతతి పయోనిధౌ పతంగః'

(పశ్చిమ సముద్రములో సూర్యుఁడు పడుచున్నాఁడు)

బాణ—'సరసిరుహాముదరేషు మత్తభృంగః'

(కమలములలోపల భ్రమరములు చేరినవి)

భవభూతి—'ఉపవనతరుకోటరే విహంగః'

(వృక్షముల తొఱ్ఱలలోనికి పక్షులు చేరినవి)

కాళి—'యువతిజనేషు శనైశ్శనైరనంగః'

(యౌవనస్త్రీలలో మెల్లమెల్లగా మన్మథుఁడు చేరుచున్నాఁడు)

భోజ—కవిశ్రేష్ఠులారా! నా సమస్యను మిగులఁజక్కఁగాఁ బూరించి నంతోష సంతోషము. కాళిదాస కవిచంద్రమా! సంధ్యా సమయము వర్ణన మీయొక్క వినఁగోరి మిగుల కుతూహలపడుచున్నాను.

కాళిదా—వినుఁడిద్దె.

శ్లో. వ్యాకరణమివ విద్యార్థి యుతే పండితశ్రీః
మృగేంద్రపథ విదేశేష్విప్ర్యాపాయాంతి భృంగాః
కస్మాపతి పర్యోకం పీడయంత్యంధకారో
ధనమివ కృపణస్య వ్యర్థతామేతి చక్షుః.

భోజ— ఆహా! యెటువంటి సమయోచిత భావమును జెప్పెను. భవభూతీ! వింటివా? వ్యసనాక్రాంతుఁడగువానివిద్యవలెఁ గమలములు మాసినవఁట. పరదేశగమనమున వచ్చిన గుణశాలివలె భ్రమరములు దిక్కుతోచకున్నవఁట. దుష్టరాజువలెఁ జీఁకట్లు లోకమును బీడించుచున్నవఁట. లోభియొక్క ధనమువలెఁ గన్నులుండియుఁ గానరాకున్నవఁట. ఆహా! యెంత స్వభావ సిద్ధమగు వర్ణన. మహాకవులారా! ప్రొద్దుగ్రుంకినది గాన నేఁటికీసభ చాలింతము.

అందఱు—చిత్తము. (నిష్క్రమింతురు)

---

## 3 రంగము

[రాజమార్గమున వెన్నెలలో భోజ కాళిదాసులు వినోదముగా మాటాడుచు వచ్చుచుందురు]

భోజ—(చంద్రునిఁజూపి) మిత్రమా! షోడశకళా పరిపూర్ణుడగు చంద్రుఁడెంత హృదయాహ్లాదకరముగాఁబ్రకాశించుచున్నాఁడో చూచితివా?

**కాళిదా**—అతఁడును రాజుగదా! కనుక నీవలెనే ప్రకాశించుచున్నాఁడు.

**భోజ**—అట్లయిన నేమి?

**కాళిదా**—అనఁగా!

కం. గుణకవులకు బుధగణులకు
సరసాంభోజములకు నుద్దీప్తి చంద్రుఁడు దిశలన్
మెఱయుచు నున్నాఁడదిగో!
నిరుపమ తేజంబునఁగ్రొ నీవలె భోజా!.

**భోజ**—ఓహో! శ్లేషాభిప్రాయగర్భితమగు నీవర్ణన వర్ణనీయమే కాని నాఁడేకశిలానగరమును గూర్చి వర్ణించిన శ్లోకమును విన నభిలషించుచున్నాను. ఒక్కసారి చెప్పుము.

**కాళిదా**—రాజా! వినుము.

శ్లో. అపాంగ పాతైరపదేశ పూర్వై
రేణీ దృశా మేకశిలానగర్యాం
వీథీషు వీథీషు వినాపరాధం
పదేపదే శృంఖలితా యువానః.

(ఏకశిలానగరమందు యువకులు కాంతామణుల కుటిలకటాక్షవీక్షణములచేత నపరాధము లేకయే వీధులలోఁ బ్రతిపదమునందును సంకెలను వేయఁబడి యుండెదరు. అనగా—మేడలపైనుండి భావసూచకములగు క్రీగంటిచూపులచేఁ గాంతామణులు, వీధినిబోవు యువకులను జూడఁగా, వారు మదనబాణవిభిన్నధైర్యులై సంకెలలు వేసి నిలిపినట్లు కొంతసేపునిలచి ధైర్యము తెచ్చుకొని యొక్కయడుగుఁ బెట్టఁగా మఱియొక స్త్రీచే నట్లుచూడఁబడి నిలిచిపోవుచుండెదరు)

[విలాసవతి వీధిగుమ్మమువద్ద నిలిచియుండును]

భోజ—అదిగో! నీవర్ణనకుం దగినట్లెవ్వతెయో వీధిగుమ్మమున నిలచి యున్నది. ఇట్టి రాత్రిసమయమునం దీపె యెవరికొఱకో నిరీక్షించుచున్నది

విలాసవతి—(తనలో) అవురా! వేశ్యాప్రవృత్తి యెంత నీచముగా వర్ణించిరి!

సీ. ధనమిచ్చువానికై ♦ తనువు దాసము నొనర్చి
నిద్రాధిదేవికి ♦ నీళ్లువొడిచి
పరవరచిత్తాను ♦ సరణంబుగావించి
స్వాతంత్ర్యబుద్ధికి ♦ స్వస్తిఁజెప్పి
కల్లపొల్లులనాడి ♦ కపటహాస్యముసల్పి
కలిపురుషునకు ప్రా ♦ గత మొసంగి
చింతాకులితయయ్యు ♦ సంతోషమునుజూపి
సత్యదేవత నూరు ♦ సాగనంపి

గీ. మానమడుగంట ద్రవ్యాభి ♦ మానమునను
నిహపరంబులఁనును జెడి ♦ యేహ్యముగను
బరులచేఁ జూడఁబడునట్టి ♦ పాపజాతి
వారకాంతల బ్రతుకు దు ♦ ర్భరముగాదె.

భోజ—ఆగుము! ఆగుము! దానిమాట సాంతముగా నిచటనుండియే విందము. (చెట్టుచాటున దాఁగుదురు)

విలా—ఇట్లు వేశ్యలయొక్క జన్మము బహు కష్టతరము నుదూష్యమునైయున్నను గులవృత్తియగుటచే ననుసరింపక తప్పదు రూపవంతుఁడైనను, గురూపుఁడైనను, వసహ్యుఁడైనను, నాఁటికిదొరికినవిటునే యాకాలమునకుఁ బతిగా భావించి, సేవించి ద్రవ్యమార్జించుటయే మాకుజీవనము. అయిన

నవనాగరికతాభివృద్ధిచెందిన యీ కాలమున మావృత్తి క్షీణించుచున్నది. (ప్రక్కకుం జూచి) ఎవ్వరో! పురుషుండొకండీదెసకే వచ్చుచున్నాడు. వలంబన్ని నేఁడాతని నా వలలో వేసికొనవలెను.

[విద్యాధరి పురుషవేషమునఁ బ్రవేశించుచున్నది]

విద్యా—(తనలో) ఎట్టులనో ప్రచ్ఛన్నవేషంబున దేవియను గ్రహముచే నీపురిం జేరితిని. ఇంక నామనోరథసిద్ధి గల్గుటెట్లు? నాకీ కార్యమున సాయమొనర్చువా రెవరు? ఈ రాత్రి యెందేని గడిపి రేపటినుండి ప్రయత్నము చేసెదను.

విలా—(విద్యాధరిని జూచి) అహా! యేమి సౌందర్యము! ఎంత యసదృశరూపలావణ్యము! పణ్యస్త్రీనగు నేను సామాన్యముగా ధనమునకు వలతునుగాని రూపమునకు వలవనుగదా! అట్టి నాకు వీనిని గాంచినతోడనే నాసహ నను ధనమానములనితని కర్పింపవలెననెడి యుత్సాహము కల్గుచున్నది. ఈతని ముఖలక్షణములు చూచిన నీతఁడెవ్వఁడో క్షత్రియకుమారుని వలెఁ దోఁచుచున్నది. కానిమ్ము! ఇంటిలోనికిఁ బిలచి యీతని వృత్తాంతమరసెదను.

కాళి—(తనలో) ఈతనిరూపము చిత్రముగానున్నది. (ప్ర) మిత్రమా! చూచితివా! కుముదిని పద్మినినిగాంచి చంద్రుఁడని భ్రమించినట్లు దోఁచుచున్నది.

భోజ—మిత్రమా! అదెట్లు? ఆవె వేశ్యయగుటచేఁ గుముదభావమును జెప్పిన నొప్పునుగాని పురుషుఁడైన నీతనికిఁ బద్మినీసమాన మెట్లు చెల్లును?

కాళి—మంచుగప్పిన పద్మినియుఁ జంద్రునివలెఁ గాన్పింపవచ్చును గదా!

భోజ—అయినచో నాతఁడును స్త్రీయనియే యూహింతువా?

కాళి—సందేహ మేమి?

సీ. కమనీయకనులిసి ♦ కలహంసగమనంబు
చెలికిఁగాకెటఁబురు ♦ షులకుఁ గలుగు
నెలవంకఁ గిరుచించు ♦ నిరుపమవదనంబు
చెలికిఁగాకెటఁ బురు ♦ షులకుఁ గలుగు
కనకవిద్యుల్లతా ♦ కలితలావణ్యంబు
చెలికిఁగాకెటఁ బురు ♦ షులకుఁ గలుగు
కందోయి చందంబు ♦ విందొనర్చు పసందు
చెలికిఁగాకెటఁ బురు ♦ షులకుఁ గలుగు

గీ. పాలుగారెడి మృదుల క ♦ పోలయుగము
స్త్రీలకేకాని పురుషుల ♦ కేలకల్గు
పురుషవేషంబుఁ దాల్చిన ♦ తెఱఁగుఁదోఁచె
సత్యమీబిడ స్త్రీయె భో ♦ జక్షితీంద్ర.

భోజ—సరి! సరి! నీవు సదా శృంగార రసలోలుఁడవు. వేదవాక్యములకు సహితము, నాఁడు సభలో శృంగార భావమును గల్పించితివి. కావున నీకుఁ బురుషులుకూడ స్త్రీలవలెఁ గాన్పింపవచ్చును.

కాళి—అట్లుగాదు ఇప్పుడు పరీక్షింపవచ్చునుగదా!

భోజ—అట్టులేని మనమిచ్చటనే దాఁగియుండి యేమి జరుగునో చూతము.

విలా—(విద్యాధరిని జూచి) ఆహా! యీతని ముఖమునందు రసికభావ ముట్టిపడుచున్నది. ఈతని సవినయముగ బల్కరింతును.

విద్యా—(తనలో) ఇదీరాత్రి వసించుటకుఁ దగిన స్థలము దొరకునో దొరకదో విచారించెదను. (ముందునకు వచ్చి నిలుచును.)

విలా—అయ్యా! తామెవ్వరు? ఇదేమి! యిక్కడనే నిలుచుంటిరి. లోనికి దయచేయుండు.

విద్యా—కాంతామణీ! నాది పరదేశము. నేనీరాత్రి వసించుటకు సమీపములో సత్రమేదైనఁ గలదా?

విలా—(తనలో) ఆహా! నా కార్యము నెఱవేఱినట్లే (ప్రకాశముగా) అయ్యా! సత్రమిచ్చటికి చాలా దూరముగ నున్నది. ఇది మా గృహమే. లోనికి దయచేయుండు. మీకుఁ గావలసిన వసతు లమర్చెదను. ఈ రాత్రి యిందే యుండి రేపు మీ యిష్టము వచ్చినచోటికిఁ బోవచ్చును రండు. ఆ యాసనముపైఁ గూరుచుండుఁడు.

విద్యా—(సంతోషమున) అటులనే కానిమ్ము. (కూరుచుండును.)

విలా—కోమలాంగా! మీవంటివారి రాకచే మాగృహము ధన్యమయ్యెను. ఈ నా ప్రార్థన నాలకించి నా యుపచారముల గ్రహింప వేడుచున్నాను.

విద్యా—(తనలో) పరపురుషుల నింత ప్రేమముగాఁ బల్కరించుచున్న యీమె కులమెద్దియో? (ప్రకాశము) రమణీమణీ! మీ కులనామములు తెలియఁగ వచ్చునా!

విలా—మేము కళావంతులము. విలాసవతి నానామము.

విద్యా—(ఆత్మగతము) ఆహా! మోసపోతినే. ఇది కళావంతుల గృహమని యెఱిఁగినచో నిందు రాకయుందునే. ఇప్పుడేమి సేయుదును?

కాళి—రాజా! యీ చెట్లచాటున డాఁగి యీ చోద్యమును జూతము. (అని కొంచెము సమీపింతురు)

విద్యా—(ప్రకాశముగా) ఓ వారాంగనా! కాశ్మీర దేశమునుండి కార్యాంతరమున వచ్చిన నాకు నీ యుపచారములతో నిమి

నిమిత్తములేదు. విశ్రాంతికై నేఁటిరాత్రి స్థల మొసంగితివి. అదియే నాకుఁ బరమోపకారము.

విలా—అట్లైన నా యుపకారమునకుం దగిన ప్రత్యుపకారముఁ జేయవలదా?

విద్యా—నావలన నీవభిలషించెడి యుపకార మెద్దియో తెల్పిన సాధ్యమైన నొనర్చెదను.

విలా—అట్లైన వినుఁడు!

కం. యువతీజన మదనుండవు
నవయౌవనవతిని నేను ♦ నాటిన మోహే
చ్ఛవరించితి నిను గాదన
క వరాంగక! యేలుకొనుము ♦ కామసమానా.

విద్యా—ఓకాంతా! నీచమత్కారమును మాని మర్యాదగాఁ బలుకుము స్త్రీవయ్యును సిగ్గువిడిచి యిట్లు మాటాడఁ జెల్లునే?

విలా—మోహనాంగా! నీవంటి రసికశిఖావతంసు లిట్లు మాటాడఁ దగునా?

శ్లో. సమస్తశృంగార వినోదశీలా
లీలావతీ కోకిలకంఠనాళా
విలాసితానో నవయౌవనేన
వృథాగతంతస్య నరస్యజీవితం.

కావున నెంత శృంగారవతియైనను, నవయౌవనవతి గాసిచ్చో నట్టి దానిని గూడనివాని జన్మము వ్యర్థమని నీవు వినలేదా?

విద్యా—ఓ చతురికా!

శ్లో. సమాధిహంత్రీ! జనమోహయిత్రీ!
ధర్మైకమంత్రీ! కపటస్యతంత్రీ!
సత్కర్మహంత్రీ! కలికాచయేన
వృథాగతంతస్య నరస్యజీవితం.

అని పాపహేతుభూతం బగు నిట్టి స్త్రీసంపర్కము గలజన్మము వ్యర్థమని కూడఁ జెప్పిన పెద్దలవాక్యము నీవు విననట్లున్నది.

విలా—మనోహరా! స్త్రీలెల్ల రట్టివారనియే చెప్పెదరా?

విద్యా—యోగ్యురాండ్రగు పతివ్రతలు పరపురుషులనిట్లు పల్కరింపరు. ఇఁక గణికవగు నీయందు నేను జెప్పిన గుణములుండు టకాశ్చర్యమేమి?

భోజ—మిత్రమా! నీసందేహమింకను నివారణ కాలేదా?

కాళిదా—అయినది. ఈపె స్త్రీయగుటచేతనే యాయువతి ప్రార్థనను నిరాకరించుచున్నది.

భోజ—చాలు! చాలు. తనంతఁదాను బ్రార్థించిన వేశ్యను దిరస్కరించిన యాతఁడు తరుణుఁడైనను, దరుణియనియే నీవభిప్రాయపడుచున్నావా?

కాళిదా—తరుణిని దరుణియుంటినో, తరుణిని దరుణుఁడంటినో కొంచము సేపున్నచోఁ దెలియఁగలదు.

విలా—(విద్యాధరినిజూచి) కోమలాంగా! పెక్కుమాటలేల? నీవు రాజకుమారుఁడనని చెప్పితివి. శరణాగతరక్షణ మీకుల ధర్మము. ఆధర్మమునుబరిపాలింతువా, లేదా?

విద్యా—నాకులధర్మమును గాపాడుకొను భారము నాది. అందులకు నీ నిర్బంధమేల?

విలా—రసికాగ్రణీ! నీతోడి సుఖమనుభవింపఁగోరి నీపాదములపైఁ బడి ప్రార్థించుతరుణిని నిరాకరింపన్యాయమగునా! ధర్మజ్ఞుఁడా! ఆర్తయై వేఁడు, నబలకోర్కె నెఱవేర్చుటే మీ ధర్మము. ఆఁకలిగొన్నవారికన్నదానమొనర్చినట్లును, శుష్కించిన వృక్షముపైఁగుఱియు సువృష్టివోలెమిమ్మింతగా వేఁడికొనునామీఁద మీకరుణారసవృష్టి గుఱిపించుటయే మీదయకు సార్థక్యము.

విద్యా—(ఆత్మగతము) ఆహా! యెంతనిర్బంధమునకు, నెంత విషమ
పరీక్షకుఁ జిక్కితిని. ఏమిచేయుదును? [యోజించి] నామీఁద
నీపెను మోహముకల్గుటయే యింతయనర్థమునకుఁ గారణము.
ఇంకఁ గోపమువచ్చినట్లుగామాటాడి యీయవస్థనుదప్పించుకొ
నవలెను, ఓవారాంగనా! నీమాయావాగురులంజిక్కి మో
సపోవు మందమతులకడ నీచమత్కారములు చూపింపుము.
స్త్రీలకు భూషణమగు మానమును బజారున వెచ్చఁబెట్టు నీచో
క్తులు నాముందు పలుకకుము, మఱియుఁబణ్యాంగనలయొక్క
సహవాసదోషమునఁ గల్గు మేళ్ళు లోకమునకు విశదమైయు
న్నవి. కావునఁ దుచ్ఛసుఖములకై నన్ను బురికొల్పకుము. ధ
నాకర్షణకై చూపునీ మోహమునకు వశమగుదునని యెన్నఁడు
ను దలంపకుము.

విలా—ఇదినీవుచెప్పినట్లుగా ధనాకర్షణకై చూపుప్రీతిగాదు. నీధనము
నాకువలదు. నీమనసిచ్చినఁజాలును.

కాళిదా—తరువాత ధనము తనంతటదానే వశమగునుగదా?

విద్యా—ఇట్టికోర్కెల విడనాడుమని చెప్పుటలేదా!

విలా—అయినను దనంతటఁదాను వలచివచ్చినసుందరిని నిరాకరించు
ట ధీరలక్షణమా? మోహనాంగా, నీమనోహరరూపముచే
నాకర్షింపఁబడిన నన్నిట్లు త్రోసివేయుదురా? నేను నీకు దగిన
యువతినిగానా? రూపవతినిగానా? ఒకవేళరసికురాలనుగా
నా? నావంటితరుణి యింతగా వేఁడుకొను నప్పుడు జితేంద్రి
యులు సయిత మూరకుండగలరా? నావంటి రసికురాలి ప్రా
ర్థనమన్నించుటే నీవంటివాని రూప యౌవన సంపదకు సార్థ
క్యము. ఈచిత్తస్థైర్యమునర్హమగుపట్ల నుపయోగింపుము. ఇది
యా నీవివేకము? నీమాటచే నీకు లోకానుభవముగాని సుఖా

నుభవము గాని యున్నట్లుతో పగు. అందువలన నే నీహృదయ మింతకఠినముగా నున్నది

కాళిదా—(చాటున) ఈప్రాయంబున దరుణులందు గఠినత్వమే వాంఛనీయముగదా ?

భోజ—నీమాట మనస్సునకా ? దేహమునకా ? రెంటికినన్వయించు చున్నది.

విద్యా—(ఆత్మ) ఎటువంటి సందిగ్ధావస్థ సంప్రాప్తమైనది (ప్రకాశము) ఓ వారమరీమణీ! నన్ను వ్యర్థముగా నేల నిందించెదవు. నీయభీష్టము నెఱవేర్ప జాలను.

కాళి—అది నేను దొలుతనే చెప్పితిని.

విలా—కృపారహితుండా! నన్నేల నిందింపవలెను ?

చ. కమలదళంబులన్ ♦ గనులు కల్పనచేసియు గాలు నీతులన్
గమలములన్ ఘటించియు సు♦నాసిక సంపెగతోడఁ జేసి యో
ష్ఠములఁజివుళ్ళ నేర్పఱచి ♦ చంచలబుద్ధివహించి నీదు చి
త్తముశిలతో నొనర్చిన వి ♦ ధాతనుదూఱెదఁగాక సుందరా.

అయ్యో! ఈనీ కోమలాంగములు నీ మృదుకపోలములు నీ బాహులతలు నరణ్యమునఁ బూచిన కుసుమములవలె వ్యర్థము లుగావలసినవే? అనుభవించి యానందమును బొందుటకు నాకు ప్రాప్తి లేదా? నాయందుఁ గరుణజూపవా?

విద్యా—నీవిట్లు మాటాడుటచూడ నాకే సిగ్గగుచున్నది. చాలు ఊరకుండుము.

కాళి—అవును, కులస్త్రీ యగుటచేత.

భోజ—పురుషుఁడైనను జెప్పవచ్చును.

విలా—ఇది లజ్జకు సమయముకాదు. ఒకవేళ నీకంత సిగ్గుగా నున్నచో నేనే నీమృదుకపోలముల స్పృశించెదను.

విద్యా—నీకుఁ బిచ్చి మిక్కిమీఱుచున్నది.

విలా—నిజము. నీ బాహుపాశములచే నన్ను బంధించినచో నీపిచ్చి కుదురును, (అని సమీపించును)

విద్యా—దుడుకుతనము వలదు. దూరముగనిల్చి మాటాడుము.

కాళి—(తనలో) ఇపుడు తేలవలెను.

విద్యా—(తనలో) ఇంక నాపంతము చెల్లదు. వారస్త్రీల చేతిలోఁ జిక్కినవారెంత నేర్పరులైననేమి? ఇఁక నా నిజస్వరూపమును దెల్పినఁగాని లాభములేదు (ప్రకాశము) గణికా శిరోమణీ! నీకు నాయందు నిజమైనవలపు జనించినట్లు వ్యక్తమైనది. నేనింత పట్టుపట్టుటకుఁ గారణముగలదు నీవభయ మొసంగి నచో దానిని దెల్పెదను.

విలా—ఇదే నాయానతి నీకభయ మొసంగితిని. సంశయింపక తెల్పుము.

విద్యా—నవమోహినివలె రూపయౌవనములు గల్గి రసికురాల వగు నీయట్టి రమణి తనంతవలచి ప్రార్థించినఁ బురుషుఁడ నైతినేని మనస్సు చలింపకుండునా?

విలా—(ఆశ్చర్యముతో) ఏమేమీ! పురుషుఁడనైన ననియా! అయి నచో నీవు పురుషుఁడవు కావా? (చక్కఁగాఁ జూచి) మహా చతురమతి ననుకొంటిని. నేనే మోసపోయితినే. ఈమె స్త్రీ పురుషవేషము ధరించినది.

విద్యా—(లజ్జచేతఁ దలవాల్చును)

కాళి—రాజేంద్రా! ఇప్పటికైనను నీసంశయము నివారణమైనదా?

భోజ—నిజము. నీవు మహానుభావుఁడవు. నన్ను మన్నింపుము.

విద్యా—(వేషమునువీడి) ఓ సఖీ! క్షమింపుము. నా వృత్తాంతము నాప్తురాలవగు నీకు మఱుఁగుసేయక తెలియఁజేసెదను. ఇంక

నా ప్రాణమానములు నీ యధీనమందున్నవి. అవి నీవు కాపాడ
వలెను. నీకోర్కెలను నెఱవేర్పఁజాలక నీకుఁ గోపము గల్గునట్లు
చేసి నీవొనర్చు నిర్బంధమునుండి తప్పించుకొనుటకై వేశ్య
లను దూలగాడితిని. దానిని నీవు మనస్సునం దుంచుకొన
వలదు. నాకిక్కడ దిక్కెవరును లేరు. నీవే తల్లివి. నీవే
తండ్రివి. నీవు నాకభయ మొసంగితివేని కొలఁది దినంబు
లిందుండెదను. లేనిచో నేనాత్మహత్య గావించుకొనవలసి
వచ్చును.

విలా—ఈ స్వల్పకార్యమునకై యాత్మహత్య గావించుకొన వల
యునా? నీ వెంత మాత్రమును జింతింపవలదు. నీ యిష్టాను
సారముగ నాగృహమునందే యుండుము.

విద్యా—ఉండవచ్చును గాని, నాకిప్పు డొక నియమము గలదు.
అందువలనఁ బ్రత్యేక గృహమున్నచో నా కనుకూలముగా
నుండును.

విలా—నీనియమ మెట్టిదని తెలిపినచో దాని కనుకూలముగ నేర్పా
టులు గావించెదను.

విద్యా—సోదరీ! నానియమ మెట్టిదో వినుము.

కం. పరపాకము భుజియింపను
బరపురుషుల సేవనొల్లఁ ♦ బ్రవిమల భక్తిన్
నిరతము నిర్మలకాళీ
చరణాంబుజయుగళ సేవ ♦ సల్పుట వ్రతమౌ.

విద్యా—ఇదియేకదా! సంశయము వలదు. నా యుద్యానవనమున
విలాసభవన మొకటి గలదు. అందు నీవు యథేచ్ఛముగ
నుండవచ్చును.

కాళి—(తనలో) నేనూహించినట్టుగ నీపె సత్కుల ప్రసూతయై యుండవలెను. కాని యీపె నిజస్థితి తెలియలేదు.

విలా—నెచ్చెలీ! నీపేరేమి? నీవీ పురుషవేషమును ధరించుటకుఁ గారణమును దెలియఁజేసెదవా?

విద్యా—నన్ను మధురవాణియని పిలిచెదరు. నా వృత్తాంతము విస్తరించి చెప్పినచో నేననుభవించిన కష్టములెల్ల జ్ఞప్తికి వచ్చి మిగుల దుఃఖము గలిగించును. కావునఁ గ్లుప్తముగాఁ జెప్పెదను. తల్లిదండ్రులున్నను దైవగతిచే దుఃఖమును బొంది మానరక్షణకొఱ కీరీతి వేషమునుదాల్చి మార్గవశమున నిట కరుదెంచితిని. నెమ్మదిమీఁద వివరముగాఁ దెలియజేసెదను.

విలా—మంచిది, మిగుల నలసటఁ జెందినట్లున్నావు. లోనికివచ్చి విశ్రాంతిఁ దీసికొనుము. (పోవుదురు)

భోజ—మిత్రమా! విషయమంతయుఁ దెలిసినదిగదా! ఇఁకఁ బోవుదము రమ్ము.

కాళి—(ఆత్మ) ఈ మోహనాంగిరూప మసదృశముగ నున్నదే. యీపె వృత్తాంతమును వివరముగాఁ దెలిసికొనుటకు నా మనస్సు వేగిరపడుచున్నది. ఏమి చేయుదును? ఇది సమయము గాదు. (ప్రకాశము) రాజా! అటులనే పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

# మహాకవి కాళిదాస

## పంచమాంకము

### 1 రంగము

[విలాసవతి యింటిముందునుండి కాళిదాసుడు ప్రవేశించుచుండును]

కాళి—రాలలోనున్న రత్నమువలె విలాసవతి గృహమునందున్న యానూతన రమణిని జూచినదాది యామె వృత్తాంతమును దెలిసికొనుటకు నామనం బాతురపడుచున్నది. ఆమె సౌందర్యము చాతుర్యము మిగుల నద్భుతముగా నున్నది. పరస్త్రీలపైఁ జిత్తమును బోనీయరాదని యెఱింగియున్నను నేఁడేలకో నాచిత్తము చలించుచున్నది.

కం॥ సుజనుల మదిచలియించుట
కజకల్పిత ఘటనగాక ♦ యన్యంబగునే
నిజముగుచో బుధవాక్యము
గజగామిని నాకు సతిగ ♦ గ్రాహ్యంబగుతన్.

పరికింపఁగా నామె యవివాహితయని తోఁచుచున్నది. నియమముగల్గి కాళికాదేవి పాదకమలముల సేవించుచుందునని చెప్పెను. దీనిచే ననురూపుఁడగు పతిని బడయుటకుఁ గాళికాదేవి నుపాసించుచున్నదని తలంపవచ్చును. మహాకాళికి నామీఁదఁ గటాక్షముండుటచే నామెకు నన్నే పతినిగాఁ జేయునో యేమో! ఆ రమణిమీఁద నే నాచిత్తము లీనమగుటచే నాకు నిద్రాహారములు సహితము రుచింపకున్నవి. ఆమె నాకు లభించుటెట్లు? కానిమ్ము! ముందు విలాసవతి

మూలమున నాపె వృత్తాంతమును గ్రహించి తదుపరి యాపెను బొందు మార్గము నన్వేషించెదను. (ప్రక్కకు జూచి) ఇదియే విలాస వతి గృహముగాఁబోలు. కాళికా దర్శనము చేసికొని వచ్చునప్పుడు దీనిని బలుకరింతును (అని నిష్క్రమించును.)

మధు—(విద్యాధరి ప్రవేశించి తనలో) లోకములో సుఖదుఃఖములు రెంటిని సరిసమానముగాఁ గల్పించు దైవమాయ మిగుల నాశ్చర్యముగా నున్నది. నా కైశ్వర్య పాండిత్యములందు సమానులు లేరని నేనత్యంత గర్వమున నుంటిని కాని పాను రునికిఁ బత్నిఁగాఁ జేయుటచే మిగుల దుఃఖము నొందితిని. తిరిగి యాతఁడే మహాకాళి యనుగ్రహముచే మహా విద్వాంసుఁడగుటచేఁ బరమానంద మందితిని. కాని వెంటనే నన్నతఁడు పరిత్యజించి పోవుటచేఁ దిరిగి దుఃఖముల పాలైతిని. అయిన నశరీరవాణిద్వారా కాళి సంతోషబీజముల నాటుటచే శాంతించితి. ఆపె యానచే ధారానగరమునకు బహుకష్టములమీఁద వచ్చితిని. ఇఁకముం దాపె యనుగ్రహముచే సుఖకరముగు నిష్ఠారము నెఱవేఱవలెను. కాని దీనికిఁ దగిన మనుష్య ప్రయత్నమేదియో తోఁపకున్నది (యోజించి) నేనీ వేశ్యా గృహమున కరుదెంచుట యొకవిధముగ ననుకూలమే. ఏల యనఁ బట్టణమునందలి విశేషములెల్ల సాధారణముగ నిట్టి స్థలములలోఁ దెలియును. కావున నా కాంతుని విషయమును విలాసవతిమూలమునఁ దెలిసికొనఁ బ్రయత్నించెదను. (ప్రక్కకుఁ జూచి) ఆపె యీయెడకే వచ్చుచున్నది.

విలా—(ప్రవేశించి తనలో) మధురవాణి యెంత రూపవతి! ఇట్టి సౌందర్యరాశి నాయొద్దఁ జేరుట నా యదృష్టము. నియమముతోఁ గొలఁదివినము లిందుండెదనని చెప్పెను. నా చేతికిఁ

జిక్కినమీఁద నియమమన నెట్టిది? రెండుమూఁడు దినము లూరకుండి యుపాయముచే నామార్గమునకుఁ ద్రిప్పి యీపె మూలమున నా ప్రయోజనమును గావించుకొనెదను. (మధుర వాణిని జూచి) ఏమి యిట్లాలోచించు చున్నావు?

మధు—మఱేమియును లేదు. ఈ నగరమునుజూడ నాకు మిగుల నానందమాయెను. ఇందలి విశేషముల నీవలనఁ దెలిసికొన వలెనని యోజించుచున్నాను.

విలా—ఓహో! చాల సంతోషము (తనలో) నాబోధన కవకాశ మిప్పుడే చిక్కినదే (ప్రకాశము) ఓ చంద్రాననా! వినుము.

చ. అనుపమ చాతురిన్ దగు మ ♦ హా రసికాగ్రణులుందు దీవినా
మనసిజుఁ రాణినిన్ దెగడు ♦ మానినులుండెడి రాజధాని నా

మధు—(ఆత్మ) కుల విద్యావిషయమే మొదటఁ బ్రారంభించెనే ?

విలా—

ధనదుని వెక్కిరించు ధన ♦ ధాన్యసమృద్ధి వహించినట్టి పెన్
ధనికుల కాలవాలమనఁ ♦ దాల్చెఁ బ్రతీతి జగత్త్రయంబునన్.

మధు—(నవ్వుచు) మీకవశ్యముగు ధనయౌవన విషయములఁ గూర్చి నేనడుగలేదు. ఇక్కడి రాజెవ్వరు? అతని పరిపాలన సౌవిధ ముగానున్నది? ఆతని యాస్థానమందు విద్వాంసు లెవ్వరైనఁ గలరా? ఈ విషయములఁ గూర్చి నీకేమేనియుం దెలిసినఁ జెప్పుమంటిని.

విలా—(ఆత్మ) ఔరా! నాయుద్దేశ్యమప్పుడే గ్రహించినదే (ప్రకాశము) చెలియా! రాజును ధన యౌవన సంపన్నుఁడే. ఆతఁడు మహారసికులైన కవుల కాశ్రయమొసంగి యుత్యుత్తమ కవిత్వము చెప్పువారల కక్షరలక్ష లిచ్చుచుండును. అందువల్ల నేనట్లు చెప్పితిని.

మధు—సంతోషము, ఆతని పేరేమి ?

విలా—భోజరాజు, మఱియు

ఆ. వె బాణకాళిదాస ♦ భవభూతి ముఖ్యులా
సప్తదిగ్గజంబు ♦ లందులోనఁ
గవనరాజ్యమేలు ♦ కవిసార్వభౌముండు
కలఁడు కాళిదాస ♦ ఘనయశుండు.

మధు—(ఆత్మ) ఆహా! ఈకాళిదాస శబ్దము వినినంతనే నాహృదయ మాందోళనపడుచున్నది. (ప్రకాశము) చెలీ! ఆ కాళిదాసుఁడను మహానుభావుని నీవెప్పుడైనఁ జూచితివా?

విలా—భువనప్రకాశుఁడగు కాళిదాసునే చూడకుందునా ?

మధు—ఆతఁడేమి వృద్ధుఁడా ?

విలా—విజ్ఞానమున మాత్రము వృద్ధుఁడే.

కం. నవయౌవన సౌందర్యము
రవిసమ తేజంబుగల్గి ♦ రసికాగ్రణియై
కవిసార్వభౌమ బిరుదము
భువిలోపలఁ గాళిదాస ♦ పూజ్యుండందెన్.

మధు—(ఆత్మ) ఆహా! నా ప్రియుఁ డీరీతిగనే యుండెను గదా.

విలా—ఇంతయే కాదు. ఆతఁడు శృంగారరస ప్రియుండు గానకళా విశారదుఁడు. హాస్యప్రసంగి ఆతని చరిత్ర మెంత వర్ణించినను జాలదు. రాజాతని కర్థాసన మొసఁగి మన్నించును.

మధు—(ఆత్మ) మహాకాళి యనుగ్రహముచే మహానుభావుఁడైన యాతఁ డట్లుండుట కాశ్చర్యమేమి? కాళిదాసుఁడను పేరే సందేహము గల్గించినది. ఇప్పుడాతని రూప పాండిత్య విచారణచే నా నాథుని కథ స్మరణకు వచ్చుచున్నది. (ప్రకాశము) నెచ్చెలీ! ఆతఁ డేదేశమునుండి వచ్చినది నీకుఁ దెలియునా?

విలాసవతి—ఆతఁడు తేజోవతీనగరమునుండి వచ్చినాఁడట

మధురవాణి—[ఆత్మ] అహో! ఇంకను సందియమేల? ఆతఁడే నాప్రాణవల్లభుఁడు.

విలాసవతి—(తనలో) ఆతనినిగూర్చి యింతవివరముగా బ్రశ్నించినది. ఆతనిసౌందర్య పాండిత్యములఁగూర్చి విని యీపె చిత్తముచలించియుండనోపు. ఇది తన నియమమును విడుచుటకు మొదలు

మధురవాణి—చెలీ! ఆమహానుభావుని దర్శనము గల్గినచో నా జన్మము పవిత్రమగును- అదెట్లు నాకు లభించును?

విలాసవతి—[ఆత్మ] విన్నదిమాఁదట జూడవలసి వచ్చెను. చూచినదిమాఁదట......ఏమగునో (ప్రకాశము) సఖీ! ఆతనిగాంచుట కష్టముగాదు. ఆతఁడు సర్వసులభుఁడు. నిత్యము సంధ్యాసమయమునఁ గాళికాదేవి దర్శనమునకై మనయింటిముందు నుండియే పోవును. అప్పుడు నీవాతనిని జూడవచ్చును.

మధురవాణి—సర్వసులభుడంటివే, ఆతనితో మాటాడుటకు సాధ్యమగునా?

విలాసవతి—(ఆత్మ) ఈపె చిత్తవృత్తి వ్యక్తమైనది. ఇంక సులభముగ దారికి దీసికొనిరావచ్చును. (ప్రకాశము) చెలీ! దానికిని బ్రయత్నింతము- నీకుఁ గుతూహలమున్నచో నేను జెప్పినట్లు వినుము_ ఆతఁడిక్కడకువచ్చు ప్రయత్నముఁ జేసెదను.

మధురవాణి—ఆమహానుభావుని జూచు కుతూహలము నాకు మిక్కుటముగఁ గలదు- ఏమి చెప్పెదవో చెప్పుము. వినెదను.

విలాసవతి—మరేమియు లేదు నీవుమహావిద్వాంసురాలవై యున్నావు. ఆకాళిదాసకవిచంద్రుని వర్ణించుచు నొకగీతమును వ్రాయుము. ఆతఁడు కాళికాదేవాలయమునుండి వచ్చు సమయమునకు

దానిని నీవు పాడుచున్నచో నాతని చిత్తమాకర్షింపబడి లోనికి రావచ్చును- అపుడు నీయిష్టార్థము నెఱవేఱును.

మధురవాణి—(ఆత్మ) ఈయాలోచన చాల బాగుగానున్నది. పరపురుషుడైనచో నాతని వర్ణించి పాడుట దోసము కాని యగ్నిసాక్షిగ వివాహమాడిన మహానుభావుడైన నాప్రాణప్రియుని వర్ణించి స్తోత్రముచేయుట నాకు శ్రేయస్కరమే- ఈపె యేమేనియుఁ దెలిసికొననిమ్ము- అతని నీయెడకు రప్పించుట కిది యొక మంచి యుపాయమే (ప్రకాశము) చెలీ! చక్కనియుపాయమును జెప్పితివి. జగద్విఖ్యాతి వహించిన యాకవిసార్వభౌముని జూచుటయే ముఖ్యమైన కారణము గాన నీవు చెప్పినట్లు గీతమును నేనాలోచించి వ్రాసెదను. కాగితమును గలమును దెచ్చి యిచ్చెదవా?

విలాసవతి—తెచ్చియిచ్చెదను. (పోయి కాగితముఁగలమును దెచ్చి యిచ్చును)

మధురవాణి—(ఆలోచించుచు వ్రాయుచుండును)

విలాసవతి—(ఆత్మ) ఈమె యింతసులభముగ దారికి వచ్చునని కలనైనఁ దలఁపలేదు. జగాకర్షణకు నాకు మంచి సమయము దొరికినది.

మధురవాణి—చెలీ! ఇదిగో వ్రాసితిని వినుము. (చదువును)

కీర్తన

రూపకం—అఠాణ

సరసాలాపవిలాస - సురుచిర శ్రీకాళిదాస
నిరుపమ సత్కావ్యరచనా, నిపుణా! సుందరగుణ!
మృదుతరగాన కళోన్నత సదమల విజ్ఞానసహిత
విదితమహాశీల - విద్వజ్జనసన్నుత

సుందరమోహనరూప – యిందుసుందరముఖ ఆ
నందచంద్రవదన హ్యా – న్మందిరావాస శ్రీశ
శ్రీకాళీవరప్రసాద – సిద్ధకవితాధురీణ
ప్రాకటకైభవాభరణ – శ్రీకల్యాణమ్మదుచరణ॥

విలా—ఆహా! యింతత్వరలో నెంతచక్కని గీతమును రచించినది ఈపెకు సౌందర్యమునకుఁ దగినంత సంగీతసాహిత్య పాండిత్యముగూడఁ గలదే. పురుషులలోఁ గాళిదాసకవి యెంతటి రూపయౌవన విద్యాసంపన్నుఁడో స్త్రీలలో నీపెయు నంతటిదియే యని చెప్పవచ్చును. (ప్రకాశము) చెలీ! నీగానమాధురిని వినినచో నాతని మనస్సు చలింపకతీరదు. కావున దానినే తిరిగి పాడుచుండుము.

మధు—(తిరిగి పైకీర్తనను బాడుచుండును)

కాళి—(ప్రవేశించి తనలో) జగజ్జనని దర్శనము చేసికొని నేనిచ్చటను రావలయునని యోజించి వచ్చుచుండ నన్నీ మధురగానము మఱింత యాకర్షించుచున్నది. ఆహా గానమునందెట్టి మహిమగలదు. మురళీనాదమునకు విహ్వలచిత్తులై శ్రీకృష్ణునిలో నైక్యమైన గోపికలవలె నేనును లోకసమ్మోహనమగు నీగానమువలన విహ్వలచిత్తుఁడనై దానిలో నైక్యముందుటకు వేగిరపడుచున్నాను. ఇంకను సమీపమునకు వచ్చి వినుసరికి నన్నే బోధించి పాడుచున్నది. దీనిచే నాయాస మఱింత హెచ్చుగుచున్నది. ఇవన్నియు శుభసూచకములుగ నున్నవి. ఈ వేశ్య యింతటి సరసపద బంధురముగఁ గవిత్వము చెప్పఁగల చతురయా? ఒకవేళ నట్లైనచో నింతవఱకొక నాఁడు నిట్టిగానమును విని లేదు. కావున నిది యానూతనముగా వచ్చిన పువుబోణి కౌశలమయి యుండవలెను. దీనిచే నాకును నామీఁద మంచి యభిప్రాయము మున్నట్లు తోఁచు

చున్నది. కానిమ్మ సర్వము విశదము కాఁగలదు.

విలా—మన మనుకొనినట్టు లాతఁడు వచ్చి వీధిలో నిలచియున్నాఁడు (ముందునకు వచ్చి) పూజ్యులకు నమస్కారములు లోనికి దయచేసి యీపీఠ మలంకరింపుఁడు.

మధు— (చాఁటునకుఁ బోయి నిలిచియుండును)

కాళి—కళ్యాణమస్తు. (లోనికివచ్చి కూర్చుండును)

విలా—(నవ్వుచు) పూజ్యవరేణ్యా! మీ యాశీర్వాదము క్రొత్తగా నున్నదే?

కాళి—నేనిచ్చటికిఁ క్రొత్తగా వచ్చుటచేత నా యాశీర్వాదమును క్రొత్తగా నున్నది.

విలా—అట్లైనచో వేశ్యలకుఁ గళ్యాణమన నేమి ?

కాళి—(ఆత్మ) అట్లన లోకమెల్ల శుభప్రదమై యుండుట యని (ప్రకాశము) ఓ జవ్వనీ! కులస్త్రీల కొక్కటియే కల్యాణము. వేశ్యలైన మీకు నిత్యకల్యాణము గదా !

విలా—(సిగ్గుచేఁ దలవంచి) క్షమింపుఁడు.

మధురవాణి—(ప్రక్కనుండి ఆశ్చర్యమున) ఆహా ! ఈతఁడేకదా నాప్రాణకాంతుఁడు.

ఉ. కంటిని బ్రాణవల్లభునిఁ ♦ గాయజతుల్య మనోజ్ఞమూర్తినిన్
గంటిని గాళికాచరణకంజములన్ ♦ భజియించుపూజ్యునిన్
గంటిని గాళిదాస కవిగండరగండని ♦ బందితోత్తమున్
గంటిని నాదుప్రాణమును గంటిని ♦ గంటి నమేయమోదమున్.

ఈతఁడు నిజవృత్తాంత మెఱింగినచోఁ దిరిగి నన్ను నిరాకరింప వచ్చును. కావున యుక్తిచేతనే యీతని వశపఱచుకొని తద నంతరము నిజము నెఱింగింపఁదగాని ఇప్పుడీతని భావమెట్లు న్నదో తెలిసికొనవలెను గదా ?

విలాసవతి—మహానీయా! అపూర్వమగు మీ సేవ లభించుటచే నేను ధన్యురాల నైతిని.

కాళిదా—నీవలన నుపచారములందుటకన్న నీమధుర వాణిచే నాకర్షింపఁబడి వచ్చితిని.

మధుర—(ఆత్మ) ఏమీ! నావలన నాకర్షింపఁ బడెనా? యట్లైన నేనే ధన్యురాలను. కాని నన్నెప్పుడు నాతఁడింకను జూచియుండలేదే? (యోజించి) కాదు! నావలనఁగాదు. మధురవాణి యనఁగా మధురవాక్కులచే నని చెప్పవచ్చును. ఒకవేళ నట్లైనను నావాణియేకదా యది. కావున నిరాశపడనక్కర లేదు. హృదయమా! తొందరపడవలదు.

విలాసవతి—(ఆత్మ) ఇదేమి? యీతఁడు మధురవాణి నెక్కడఁజూచెను? కాదు? మధురగానమువిని యట్లు చెప్పియుండవచ్చు (ప్రకాశము) రసికాగ్రణీ! మధురవాణిచే నాకర్షింపబడి ప్రయోజనమేమి? ఈవిలాసవతిని బొందినఁగదా సుఖసంతోషములు.

కాళిదా—విలాసవతిది బాహ్యాడంబరము మాత్రమే కాని మధురవాణియందు మానసికానందము గలుగునుగదా.

మధురవాణి—(ఆత్మ) ఈతని మాటలయందు నాకనుకూలమగు శ్లేషార్థము స్ఫురించుచున్నది.

విలాస—విలాసవతులవలన సరసులకు మనస్సంతోషము గలుగదా?

కాళిదా—విలాసవతియం దానందింపఁ దగినవారు విటులు. నేను మధురవాణి కానందించువాఁడను. కావున విలాసవతిని విటులఁదను పనిమ్ము. నాకు మధురవాణియే కావలయును.

మధురవాణి—(ఆత్మ) ఈతఁడు వచించు మధురవాణిని నేనుగాదుగదా

విలాసవతి—మహాభాగా! మీకు మధురవాణియందే కోర్కెయున్నచో గాన మొనర్చెదను.

కాళిదా—(ఆత్మ) నేనే చమత్కారముగా మాటాడుచుంటి ననుకొనుచుండ నాకన్నఁ జమత్కారముగా మాటాడుచున్నది. (ప్ర) అంగనా! యిప్పుడు వినఁబడిన మధురవాణినే వినఁగోరి వచ్చితిని.

మధురవాణి—(ఆత్మ) అనఁగా నన్నే పేక్షించి వచ్చినట్లు స్పష్టమైనది.

విలాసవతి—కవివరా! అది నాచెలికత్తె పాడినది. నేనంతకన్న మధురముగాఁ బాడెదను.

కాళిదా—ఆగుము. ఆ నీసఖిపేరేమి?

విలాసవతి—మధురవాణి

కాళిదా—ఓహో! స్వభావమధురవాణి యగు నాపె నామమును మధురవాణియా? మంచిది. ఆపె పాడిన గీతమును రచించిన దెవరు?

విలాసవతి—(ఆత్మ) నిజము చెప్పక తప్పదే? (ప్రకాశము) నాప్రోత్సాహముచే నాపెయే రచించినది.

కాళి—ఓహో! యాపెకు సంగీత సాహిత్యముల రెంటియందును బాండిత్యమున్నదా?

విలా—ఉన్నది. (ఆత్మ) మధురవాణివిషయము తప్ప వేఱువిషయ మితనికిఁ గావలసినట్లులేదు. ఆపె నీతఁ డెక్కడఁ గాని యిది వఱకే చూచెనో యేమో?

కాళి—అయిన నాపె యిక్కడనేయుండునా?

విలా—ఔను. ఆపెను మీరిదివఱకెక్కడేని చూచినారా?

కాళి—చూచితిని.

విలా—ఎప్పుడు?

కాళి—పురుషుఁడుగా నున్నప్పుడు.

విలా—(ఆత్మ) ఓహో! నాఁడీవిషయ మెల్ల నెట్టులనో తెలిసికొనినట్లే నేఁ డాపెయందనురక్తుఁడై యిట్లువచ్చెను.

మధు—(ఆత్మ) ఆహా! నేనే ధన్యురాలను.

కాళి—ఆమెను జూడవచ్చునా?

విలా—అవశ్యము చూడవచ్చును (ప్రక్కకుఁ బోయి) మధుర వాణీ! యిటురమ్ము!

మధు—(వచ్చి తలవంచి దూరముగా నిలుచుండును.)

కాళి—(చూచి తనలో) ఆహా! యిప్పటికిఁ గదా నేత్రసాఫల్యము గల్గినది. పూవునకుఁ దావివలె నీమె శారీర సౌష్ఠవమునకుఁ దగిన శరీర సౌందర్యమొసంగి బ్రహ్మ తన సామర్థ్యమును ప్రదర్శింపఁగల్గెను. (ప్ర) ఈమె లక్షణములు చూచినచో సత్కులప్రసూతి యగు మహా పతివ్రతవలె నున్నది. ఈమె నీకెట్లు చెలియాయెను?

మధు—(ఆత్మ) ఆర్యపుత్రునికి నాయందు సంశయము గల్గినట్లు వ్యక్తమైనది.

విలా—మహానుభావా! యీమె క్షత్రియపుత్రిక. కొలఁది దినముల క్రిందటనే యిక్కడకువచ్చి నాకుఁ బరిచితురాలయ్యెను.

కాళి—(ఆత్మ) నేనూహించినట్లే యీమె నాకుఁ బరిగ్రహణార్హు రాలే యైయుండవలెను. కానిమ్ము, విచారించి చూచెదను. (ప్రకాశము) ఈమె యేదేశమునుండి వచ్చినది?

విలా—కాశ్మీర దేశమునుండి.

కాళి—ఇట్టులొంటరిగా వచ్చుటకుఁ గారణము?

విలా—బుధాగ్రణీ! విద్యావతియైన యీమెకు వివాహ ప్రయత్నములు జరుగుచుండఁగా నొకనాఁడు కాశీనగరమునకుఁ బోవుచు మార్గమున గంగానదిలోఁ బడవమునిఁగి దైవయోగముచే నీమె యొక్కతెయే యొక బ్రాహ్మణుని సహాయమున నొడ్డునకుఁ జేరి మానరక్షణకొఱకై పురుషవేషమున నీనగరమునకు వచ్చినదఁట.

కాళి—(ఆత్మ) సరియే. నాయూహకుఁ దగినట్లుగనే విషయము లన్నియుఁ ననుకూలపడినవి. ఇప్పుడు నాకత్యంత సంతోష మైనది. నిర్మలమైన సత్కులజాతయై విద్యావతియై యున్న యీపె పరిగ్రహణమున కర్హవస్తువని స్పష్టపడినది.

మధు—(ఆత్మ) ఈతనికి నామీఁద ననురాగము కలదనుట కనేక నిదర్శనములు గలవు. నన్నుఁ జూచినను, నా పూర్వకథ జ్ఞప్తికి రాకుండుటయు, నన్ను గుర్తుపట్టకుండుటయుఁ జూడఁగా నాకభయ మొసఁగిన మహాకాళి వరప్రభావమని తలంచెదను. దేవీమాయ యెంతటివారికి నభేద్యముకదా! ఈతనితో నెట్లు మాటాడుదును? ఇంకను లజ్జాభయములు బాధించుచున్నవే!

విలా—సఖి! మధురవాణీ! పూజ్యులు మధురవాణినే కోరివచ్చినా రఁట. నీయిష్టార్థము ఫలించును. లెమ్ము.

మధు—(శృంగారలజ్జతో) చాలు, ఊరకుండుము. జితేంద్రియులగు మహనీయులపట్ల నీవిట్లు చెప్పఁదగదు.

కాళిదా—(మధురవాణినిజూచి) ఓకోకిలవాణీ! నిన్నుఁ జూచుటకుఁ బూర్వము నేను జితేంద్రియుఁడనై యుంటిని. కాని నీవే కదా దానిని దొలఁగించితివి.

మధుర—అయ్యో! నేనే యపరాధినైతినే, యింకేమిగతి? (భయ మును నటించును)

కాళిదా—ఓభీరురాలా! భయపడెదవేల?

మధుర—మహాభాగా! అపరాధులకు శిక్షయగునని భయముండదా? అందు రాజానుగ్రహపాత్రులరగు తమకే నేనపరాధమొనర్చి తిని. కావున శిక్షింతురేమో యని భయమగుచున్నది.

విలాస—(అసూయచే) ఇంకనాకిక్కడఁ బనియేమున్నది? (పోవును)

కాళిదా—నీవొనర్చిన నేరమునకై నాబాహుపాశములచే బంధించి నీకుఁ దగిన శిక్షయొనర్చెదను.

(అని కౌఁగలింపఁబోవును.)

మధుర—ఆర్యపుత్రా! తమ స్థిరచిత్తమెంతలో మొత్తబడినది.

కాళిదా—ఓ మనోహారిణీ! నేను మొదటనే చెప్పితినిగదా. ఆచిత్తము మొదట స్థిరముగానేయున్నది. కాని

శా. నీలావణ్యము, నీకళానిపుణతల్ ♦ నీదివ్యచాతుర్య వా
చాలత్వంబును మంజుభాషలును నీ ♦ సంగీతసాహిత్యముల్
నీలోలాలకముల్ ముఖేందురుచులున్ ♦ నీరేజ నేత్రంబులున్
బాలామద్భ్రమమానసంబుఁ గఱఁగిం ♦ పన్ జేసె చిత్రంబుగన్.

మధుర—(ఆత్మ) ఇదంతయు పనినుపెక్కడికిఁబోయినది ? (ప్రకాశము) నాథా! సర్వముందెలిసిన మీరీరీతిఁజెప్పిన నేనేమని ప్రత్యుత్తర మిచ్చుదానను.

కాళిదా—అనుకూలమగు ప్రత్యుత్తరమును నీవే చెప్పవలెను. కాని నీవివాహము విషయములో నేరీతిగా నాలోచించితివి ?

మధుర—అనాథనగు నేను, మహాకాళికి దాసిని గావున నాపెయే యీవిషయమై విచారింపవలెను.

కాళిదా—ఓహోఁ సరే. ఆపెయాలోచన తెలిసియేయున్నది.

మధుర—ఏమని ?

కాళిదా—కాళిదాసి కాళిదాసుని వరింపవలెనని.

(లోపలనుండి) రసికాగ్రణీ! తాము సత్వరము దయసేయవలయునని రాజాజ్ఞయైనట్లుగా నొకసేవకుఁడరుదెంచి చెప్పెను.

కాళిదా—ఏమి సత్వరముగా రావలసినదని రాజు కబురంపెనా ? నేనిక్కడ నున్నట్లాతనికెట్లు తెలిసెను ? (ఆత్మ) అసూయాపరులై నామీఁద రాజేంద్రునితోఁ గొండెములు చెప్పుచుండు

బాణమయూరాది కవులెవరో నేనిక్కడకు వచ్చుటఁ జూచి, రాజునకెఱింగించియుందురు. కానిమ్ము మధురవాణీ! పోయి వచ్చెదను.

మధుర — మీదాసిని మఱువవలదు. (కాళిదాసుఁడు వెడలిపోవును)
ఆహా! యెంతటి యాశాభంగము గల్గెను.

కం. కరగత దివ్యామృతమును
బరమానందమునఁ ద్రాఁగ ♦ వచ్చెడు వేళన్
బరుఁడెవఁడో యెలుకఁ ద్రోసిన
తెఱఁగునఁ బళిసుఖము త్రుటిని ♦ దీఱెధరిత్రిన్.

(తెరపడును)

# మహాకవి కాళిదాస

## షష్ఠాంకము

### 1 రంగము

భోజరాజాస్థానము.

భోజ—సకలశాస్త్ర పారంగతుఁడును, తత్త్వజిజ్ఞాసువున్నైన కాళిదాసుఁడు వేశ్యాలంపటుఁ డయ్యెనన్న నమ్మఁదగిన విషయము కాదు. కాని యాస్థానపండితు లెల్ల రాతని విషయములో విపరీతాభిప్రాయమును వెలిపుచ్చుచున్నారు. నేఁటి సాయంకాలమున నాతఁడు విలాసవతియను వేశ్యయింటికిఁ బోయి నట్లుగాఁ గొందఱుచూచి చెప్పిరి. (తనలో) కాని నాఁడు చూచిన తరుణీమణికై యాతఁడా యింటికేగెనని తలంతును. స్త్రీల మానమును కాపాడుట రాజధర్మము గాన వానిని దండలించి వాని బారినుండి యామెను రక్షించెద.

కాళి—(ప్రవేశించును)

భోజ—కాళిదాస కవీంద్రా! నీవెచ్చటికిఁ బోయియుంటివి?

కాళి—నేను పోయినస్థలము నీకుఁ దెలియకయే యాస్థలమునకు నీసేవకుని బంపితివా?

భోజ—అయిన నీవక్కడనున్నమాట నిజమా! నీవట్టి స్థలముల కేగుదువని నేనెన్నఁడును దలంపలేదు. నీవిద్యాజ్ఞాన కౌశలము లీవిధముగాఁ బరిణమించినవా? నీగౌరవమును బోఁగొట్టు

కొనుటయే కాక నిన్ను సన్మానించుచున్నవారి గౌరవమునకుం గూడం గళంకము తెచ్చుచున్నావు. ఇదినీకు యోగ్యమా?

కాళి—రాజేంద్రమా!

త్రిపురారియగు పరమశివుండే మన్మథుని భారికిం జిక్కి యర్థ పౌరుషమును గోల్పోవ నింక నావంటివారి మాటయేల? ఈర్ష్యాళువుల మాటలు నమ్మి నన్నిట్లు పిలిపించి ప్రతిపక్ష సమక్షమునం బ్రశ్నించి, యవమాన మొనర్ప నెంచిన నీవెంత యవివేక నృపుండవు!

భోజ—

మ. అవునా! తొత్తులయిండ్లఁ జేరి కులవిద్యా గౌరవఖ్యాతి యె
ల్లవినాశంబొనరించు భ్రష్టుని నినున్ లాలించి పోషించి య
న్నవరత్నాంచిత సింహపీఠమిడి సన్మానంబు గావించు నే
నవివేకుండను గాక ప్రాజ్ఞుఁడనె? దుర్వ్యాపార పారంగతా.

ఆవలకుం బొమ్ము (మంత్రిదిక్కు) బుద్ధిసాగరా! మన రాష్ట్ర మున దురాచారములు చాల జరుగుచున్నవి. నేఁటినుండియే మనము ప్రచ్ఛన్న వేషమున సంచరించుచు నవియెల్లఁ గనిపెట్టి వారల శిక్ష యొనర్పవలెను.

బుద్ధి—చిత్తము.

కాళి—(ముందునకువచ్చి తనలో) ఈతఁడు ధర్మపరుఁడును బరనారీ సహోదరుఁడు నగుటచే నాకవుల ప్రేరణచే నామీఁద నాగ్రహముఁ జెందెను. ఇందు నేను గుణమును గ్రహింపవలసినదిగాని యాతనిపైఁ గోపించుట తగదు. కాని యిప్పటికి వెళ్ళిపోయి సమయోచితముగా నీతని వంచించి నన్ను దూషించి నందులకుఁ బశ్చాత్తాపపడునట్లును నిక్కొండెములు చెప్పు కవులకుఁ బరాభవమును జేసెదను. (వెడలిపోవును)

భోజ—బుద్ధిసాగరా! ఒకదినమునఁ గాళిదాసకవియు నేను నొకవిష యము పరీక్షింపఁదలఁచి వేషాంతరముల నావిలాసవతి యింటి కేగితిమి. ఆమె యింటికి నవలావణ్య సంపన్నురాలును మహా చతురమతియునగు నొకబాల యప్పుడే వచ్చినది. ఆమె యందు వీరపతివ్రతాలక్షణములు పొడకట్టినవి. ఈతనిదృష్టియు మనస్సును మాత్ర మామెయందే నిలిచినట్లు నాఁడే కనిపెట్టితిని. అదియే యీయనర్థమునకు మూలకారణమై యుండవచ్చును.

బుద్ధిసా—రాజేంద్రా! "బలవా నింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" యనుమాట తమకుఁ దెలియనిదికాదు. కాని తామింకను గొంచెము శాంతివహించినఁ జాలబాగుగ నుండెడిది. అతఁడు సంభావనీయ మాహాత్మ్యము గలవాఁడుసుమా!

భోజ—అదియుండనిమ్ము. వర్ణాశ్రమధర్మములను గులస్త్రీల పాతివ్రత్యమునుగాపాడుట రాజులకుఁ గర్తవ్యమైయున్నది. కావునఁ గాళిదాసునకుఁ దెలియకుండ నాపతివ్రతను గొనివచ్చి మన భవనమునందే యామెనూ సరక్షణమునకుఁ దగిన ప్రత్యేకమగు నేర్పాటులఁగావించి యామెనందు భద్రపఱుపుము. తరువాత సావకాశముగా నామెవిషయమై విచారింతము.

బుద్ధిసా—చిత్తము.

(నిష్క్రమింతురు)

---

## 2 వ రంగము

### రాజవీధి

[భోజరాజు, బుద్ధిసాగరుఁడు, భవభూతి ప్రవేశించుచున్నారు. కాళిదాసుఁడు దూరమున సన్యాసివేషమున మౌనము గొనుచుండును]

బుద్ధిసా—రాజేంద్రా! అదెవ్వఁడో యొకయతి మౌనమును గొనుచున్నాఁడు.

భోజ—ఏమేమీ! యతి మాంసమును గొనుచున్నాఁడా? అన్నన్నా! నారాజ్యమునందే యిట్టిదుర్నయములు నధర్మములు జరుగుచున్నవిగా! (సమీపించి యతినిజూచి)

శ్లో॥ భిక్షో మాంసనిషేవణం కిముచితం ?

(ఓయతీ! నీవు మాంసమును దినవచ్చునా?)

యతి—కిం తేన మద్యంవినా

(సారాయిలేని మాంస భక్షణమేమిప్రయోజనము)

భోజ—మద్యంచాపి తవప్రియం ?

(పరిహాసము) (నీకు మద్యముకూడ నిష్టమా ?)

యతి—ప్రియమహో వారాంగనాభిస్సహా

(వేశ్యలతోఁగూడి మద్యపానముఁ జేయుటే నాకిష్టము)

భోజ—వారస్త్రీ రతయే కుతస్తవధనం ?

(వారాంగనలతోఁ బొందుచేయుటకు నీకు ధనమెక్కడిది?)

యతి—చౌర్యేణ ద్యూతేనవా

(రాత్రి దొంగతనము పగలు జూదమున సంపాదింతును)

భోజ—చౌర్యద్యూత పరిశ్రమోస్తి భవతాం ?

(నీకు జూదమాడుటయందును దొంగిలించుటయందునుగూడ నేర్పరితనముగలదా?)

యతి—భ్రష్టస్య కావాగతిః ?

(చెడినవారికి వేఱుగతి యేమున్నది !)

భోజ—ఇదేమి! యింతధైర్యముగాఁ జెప్పుచున్నాఁడు. నేనొక దోషము నారోపించి విచారించునప్పటికిఁ దనంతతానే తన దోషపరంపరలఁ జెప్పి భ్రష్టునికింక వేఱుగతి యేమున్న దనుచున్నాఁడు.

భవ—దేవా! తాము శ్లోకరూపమున వేసిన ప్రశ్నల కన్నిటికిని శ్లోకరూపముగనే చక్కఁగఁ బ్రత్యుత్తర మొసఁగుటచే

నీతఁడు సామాన్య సన్యాసియేకాక గొప్పకవివలె గూఁడఁ దోఁచుచున్నది.

భోజ—అవునవును! నేనును నదియే యోజించుచున్నాను. మా ప్రశ్నోత్తరములతోఁ గూడిన యా శ్లోకమును దిరిగి చెప్పఁ గలవా?

కాళి—అనుజ్ఞయైనచో వినిపించెదను. వినుఁడు.

శ్లో. భిక్షో మాంసనిషేవణం కిముచితం? కిం తేనమద్యం వినా
మద్యంచాపితవప్రియం? ప్రియమహో వారాంగనాభిస్సహ
వారస్త్రీ రతయే కుత స్తవధనమ్? చౌర్యేణద్యూతేనవా
చౌర్యద్యూత పరిగ్రహో౽స్తి భవతాం? భ్రష్టస్య కావాగతిః.

భోజ—(ఆత్మ) ఆహా! ఈ చాతుర్యము మహానుభావుఁడైన కాళిదాసునకుఁ దప్ప నన్యులకు లేదు. (యతని బరీక్షించి) ఆహా! కాళిదాసుఁడే యితఁడు. (ప్రకాశము) మిత్రమా! కాళిదాసా! నన్ను క్షమింపుము. నీవు మహానుభావుఁడవు. నేను నిన్ను భ్రష్టాయని దూషించుటచే నన్ను దెప్పిపొడుచుట కీరీతి కల్పించితివా? (నమస్కరించి) నేను దొందరపడి తూలనాడి నందుల కన్యథాతలంపక నన్ను మన్నింపుము. నిన్నటి దినమున నిన్నుఁ బొమ్మని దూషించిన నన్ను క్షమించి నా వెంటరమ్ము. (అని తన మెడలోని ముత్యాలహార మొసంగును)

కాళి—రాజా! మహారసిక శిరోమణివగు నీపైఁ గోపమననేమి. నిన్ను విడిచి నేను జీవింతుననుకొంటివా, నీకోపము చల్లారినమీఁద నేనే రావలయునని యుంటిని. నాయీ కపటవేషమును మన్నింపుము. తేపటి దినంబునఁ గొలువు కూటంబునకు వచ్చెదను.

భోజ—మంచిది. (పరివారముతో ముందునకుఁ బోవును)

కాళి—ఇక్కడికి రాజువశవర్తియైనది. ఇఁక బాణమయూరాదికవుల పని పట్టవలెను. వీరికి నాపై నసూయ దినదినాభివృద్ధి యగుచున్నట్లున్నది. నృపునితో నాపైఁ గొండెములు చెప్పి నన్నవమాన పఱపవలెనని వీ రాలోచించుచున్నట్లుగా నాకుఁ దెలియవచ్చినది. కొన్ని యనుభవమునకు వచ్చినవి. కాని వారి ప్రయత్నములు నిష్ఫలములయ్యెను. తేనికి నాపై నే విధముగా నైనఁ గోపమును బుట్టింపవలెనని వ్యభిచారదోషమును నాపై నారోపించిరి. కాని దానివల్లను వారికోర్కె నెఱవేఱలేదు. నేను బ్రాహ్మణుఁడనయ్యును మత్స్యమాంసముల భక్షించుచున్నాఁడనని రాజున కెఱింగించి ఋజువు చేసెదమని చెప్పినట్లు నాయాప్తుఁ డొకఁడు నా కెఱింగించెను. అదిగో వారీమార్గముననే వచ్చుచున్నట్లున్నది. కావున వారు చూచుచుండఁగనే యొక మత్స్యమునుగొని తీసికొని పోయెదను. వారేమిచేయుదురో చూచెదను. (అని యొక మత్స్యమునుగొని వారు చూచినమీఁదఁ జంకనిడికొనును.)

[బాణమయూరాది కవులు ప్రవేశింతురు]

మయూ—బాణకవీ! సూర్యప్రకాశము ముందు, నక్షత్రములు గాన్పింపనట్లు, కాళిదాసప్రాబల్యమున మన పాండిత్యము గణనకువచ్చు నవకాశమే కలుగుటలేదు. ఇక్కడనుండి పోవుదమన్న మనలఁ జేపట్టు రాజులెవ్వరునులేరు. ఈ కాళిదాసుఁడను వ్యాధి మనకుఁ దప్పుటెట్లు?

బాణ—ఏమిచేయుదము? ఎట్టులైనను రాజునకును గాళిదాసునకును మనోవైకల్యమును బుట్టింపఁ బ్రయత్నించి విఫలమనోరథుల మైతిమి. ఇంక నేమైన నుపాయము వెదకవలయును.

మయూ——నిజము. (ముందునకుఁజూచి) ఓహో! అదెనఁ జూడుము. (మెల్లఁగా) కాళిదాసుఁడు మత్స్యమునుగొని వచ్చుచున్నాడు.

బాణ——(చూచి) మనకు జాల మంచిసమయము చిక్కినది. కాళిదాసుఁడు మత్స్యమాంసముల భక్షించునని మనము రాజునకుఁ గొండెములు చెప్పియుంటిమిగదా. నేను నిప్పుడు ప్రత్యక్షముగఁజూపుటకు మిగుల ననుకూలముగానున్నది. దీనిచే రాజునకు నిశ్చయముగా వీనిపై ననహ్యము గల్గితీఱును. (ముందునకుఁజూచి) కాళిదాసకవివర్యునకు నమస్కారము.

కాళి——శుభమగుఁగాక! ఇదేమి మీరందఱిట్లువచ్చుచున్నారు? (మత్స్యమును జంకలోఁ బెట్టుకొని నేలుపు గప్పుకొనును)

బాణ——నేఁడు మిమ్మసభలోఁ దూలనాడినందులకెంతయు వగచుచు రాజుగారు మిమ్మొకసారి క్షణము గొనిరావలసినదిగా మమ్మంపినారు. గావున దయచేయగోరుచున్నాము.

కాళి——(ఆత్మ) వట్టిది. రాజిప్పుడేకదా పోయెను. నేనూహించినట్లే వీరునన్ను భోజునిసమీపమునకుఁ దీసికొని వెళ్ళవలెనని ప్రయత్నించుచున్నట్లున్నది. కానిమ్ము నాకును మంచిసమయమే చిక్కినది. (ప్రకాశము) ఏమి రాజుకబురంపెనా? మంచిదట్లైన వచ్చెద. నడువుఁడు.

బాణ——(మయూరునిఁజూచి చెవిలో) మయూరకవీ! మొదట నీవు పోయి మహారాజునకీసంగతి వివరముగాఁ జెప్పుము. నేనిట్లే మత్స్యసహితముగా నీతని గొనివచ్చెదను.

మయూ——అట్లే కానిమ్ము (వెళ్ళును)

బాణ——(ఆత్మ) ఈతడు చంకలోనున్న మత్స్యమును దీసిపాఱవేయుట కవకాశము లేకుండ నితని వెంటనే యుండి భోజుని యొద్దకుఁ గొనిపోయెదను. (అందఱు పోవుదురు)

## 3 రంగము

[రాజు, బుద్ధిసాగరుఁడు, మయూరకవి, కూర్చుండియుందురు]

భోజ—మయూరకవీ! కాళిదాసుఁడు మత్స్యమును గొనిపోవుచుండఁగా నీవు చూచితివా ?

మయూ—రాజేంద్రా! తమతో నసత్యము లాడుదునా? మేమందఱము నుజూచితిమి. ఆతఁడు వచ్చినచో దమకే ప్రత్యక్షమగును.

[కాళిదాస బాణకవి ప్రభృతులు ప్రవేశింతురు]

భోజ—ఎల్లరకు నమస్కారము.

అందఱు—విజయీభవ!

భోజ—(కాళిదాసునిజూచి) కక్షే కింతవ ?

(నీ చంకలో నున్నదేమి ?)

కాళి—పుస్తకమ్

(పుస్తకము)

భోజ—కిముదకం ?

(కారుచున్న నీరేమి ?)

కాళి—కావ్యార్థ సారోదకం

(కావ్యసారమనే నీరు)

భోజ—గంధః కిం ?

(వాసనయేమి ?)

కాళి—రఘురామ రావణ మహాసంగ్రామ రంగోద్భవః

(అందులో వివరించిన రామరావణ మహాసంగ్రామమందలి రక్తము మొదలగు వాని వాసన)

భోజ—కిం పుచ్ఛచః ?

(తోఁకవలె నున్నదేమి ?)

కాళి—నవతాళపత్ర లిఖితం

(క్రొత్త తాటియాకులతో వ్రాసిన పుస్తకము)

భోజ—కింపుస్తకం హేకవే?

(ఓకవీ అదేమి పుస్తకము?)

కాళి—రాజర్షి భూసుర దైవతైశ్చపఠితం రామాయణం పుస్తకం.

(బ్రాహ్మణులును దేవతలును ప్రతిదినము పఠించునట్టి రామాయణ పుస్తకము]

భోజ—ఏది తీయుము, చూతము.

కాళి—(పైనఁగప్పిన సేలువను దీయఁగాఁ జంకలోనుండి రామాయణ పుస్తకము జారిపడును? భోజరాజును మిగిలినవా రందఱు కాళిదాసుని పాదములపైఁ బడుదురు.)

భోజ—పూజనీయుఁడవగు కాళిదాస కవిచంద్రమా! నా యపరాధ మును మన్నింపుము. నీమహిమ నెఱుంగక యీకవులమాటల నమ్మి నిన్నుఁ దిరిగి పరీక్షించి నే నవివేకినైతిని నీవు దైవాంశ సంభూతుఁడవు.

బాణమయూ రాదికవులు —మహానుభావుఁడవైన యో కాళిదాసకవి సార్వ భౌమా! నీ మహిమ నెఱుంగక మే మొనర్చిన యపరాధములనెల్ల క్షమింపుము.

భోజ—(ఆత్మ) ఈకవుల మాటలునమ్మి నేనవమాన మొందితిని. వీరు పరస్పరా సూయాపరులని స్పష్టమైనది. వీరెల్లరును స్వప్రయోజనముకై నన్నాశ్రయించిరే కాని నా యభ్యుద యమునకును కీర్తికిని వన్నెదెచ్చున ట్లగపడలేదు. నాయనంతరము వీరు కృతజ్ఞతతో నొక చరమ శ్లోకమేని చెప్పెదరని తోఁపదు. కాళిదాసుఁడు మహానుభావుఁడు భవి ష్యద్విషయముల నూహించి చెప్పఁగలఁడు. కావున వీనిచే

నాచరమ శ్లోకమును జెప్పించి మనసార వినియెద. (కాళి దాసుని జూచి) కవిచంద్రమా! నాచరమ శ్లోకమును నీనోటి నుండి వినవలయునని కుతూహలపడుచున్నాను. దాని దయ చేసి వచింపుము

కాళి—(ఆశ్చర్యము) రాజేంద్రా! రాజసేవ మిగులఁ గష్టము నీవు మహాపండితుఁడ వనియు రసికాగ్రణివనియు నీయాస్థానమునఁ జేరితిని. కాని నీవీకవుల కృత్రిమోపదేశమున ననేకవిధములఁ బరీక్షించి యవమానపఱుప సాహసించితివి. బ్రాహ్మణుఁడ నైన నేను మత్స్యమాంసముల భక్షింతునని వీరు నీకుఁ జెప్పినది యటుండనిమ్ము నీవామాటలు నమ్ముట న్యాయమా? ఇది తెలిసికొనియే వీరియోగ్యతలు బయటఁ బెట్టుటకు నేఁ దుద్దేశ్యపూర్వకముగా, మత్స్యమును గొనివచ్చిన మాట నిజము. కాని మహాకాళిమహిమచే నేను వచించినట్లుగా నది రామాయణపుస్తక మైనది. కేవల పండితమాత్రుఁడై వీరి కంటె శక్తివంతుఁ డెవఁడేని యున్నచో వానిని వీరలూరక విడుతురా? వానికి నీవలన నెంతపరాభవ మైనను, జేయించెడి వారు. నన్ను మీ యొద్దనుండి తప్పింపవలెనని వీరుచేసిన ప్రయత్నముల కెల్ల నీవు సాయ మొనర్చితివి. ఇప్పుడు నీవు జీవించియుండఁగనే యమంగళము నెంచి నీపైఁ జరమ శ్లోక మును వచింపవలసినదని నాకాజ్ఞాపించుచున్నావు. మీ యాశ్రితుఁడ నగుటచే, మీయాజ్ఞాప్రకారము నడుచుకొన కున్నచో మీకాగ్రహము గలుగవచ్చును. కాని మీరు జీవించియుండఁగనే మీపైఁ జరమశ్లోకమును జెప్పునంతటి విశ్వాసహీనుఁడను కాను. కావున మీసేవనైన మానుకొని పోవుదునుగాని మీకోర్కె మనసులో నైన భావింపను. ఇదే నే వెడలిపోయెదను. (అని పోవును)

భోజ——మిత్రమా! కాళిదాసా! కోపమువలదు. పోవలదు. పోవలదు. (ముందునకువచ్చి చూచి) అయ్యో! వెడలిపోయెనే.

బుద్ధి——రాజేంద్రా! కాళిదాసుడు మహాతపస్వి. సమస్త యంత్ర తంత్ర యోగసిద్ధుల నెఱింగినవాఁడు. ఆతఁడెచ్చటికిఁబోయినను సన్మానము జరుగును. అతని విషయమై మనము తగాఁ బరీక్షింపఁదగదు.

భోజ——నిజము! ఆతఁడు సహనశీలుఁడు. అసూయాపరులగు నీకవుల మాటలువిని నాయమూల్య రత్నమును బోఁగొట్టుకొంటిని. తిరిగి నాకది యెట్లుదొరకును.

బుద్ధి——రాజేంద్రా! ఆతని మనస్సునకుఁ గొంచము నొప్పిగల్గినట్లున్నది. అయినను మీయందుఁ బరిపూర్ణవిశ్వాసము గలవాఁడు. కోపము శాంతించినమీఁద నాతని మీసమక్షమునకుఁ గొని వచ్చెదను.

భోజ——అటులనే చేయుము. పోవుదము

కంచుకి——రాజేంద్రా! జయమగుఁగాక. కవిరాక్షసుఁడను మహనీయుండొకఁడు తమ యాజ్ఞకై వేచియున్నాఁడు.

భోజ——సవినయముగఁగొనిరమ్ము.

కంచుకి——చిత్తము (అని కవిరాక్షసునితో వచ్చును)

భోజ——పూజ్యులకు నమస్కారము. ఈయాసనమలంకరింపుఁడు.

కవి——విజయీభవ! (కూర్చుండి)

చం. నలువ భవత్ప్రతాపము నొ ♦ నర్చిన మీఁదటఁ దన్నిరస్తమా
పలువరమాణువుల్ గొని న ♦ భంబున వెల్గెడు చండభానునిన్
జలనిధిలోనడంగెడు కృ ♦ శానుని నింద్రుని చేతి వజ్రమున్
సలిపె సుమా విచిత్రముగ ♦ సత్కవి పండితమండిత ప్రభూ.

భోజ—కవీంద్రమా! మీపాండిత్యము, రసికత్వము, మిగుల నాశ్చర్యముగానున్నవి. (బుద్ధిసాగరునిజూచి) మంత్రీ! పూజ్యులగు వీరికిఁ బదివేలసువర్ణముల బహుమతిగానిమ్ము.

బుద్ధి—చిత్తము.

కవి—రాజా! నీపదివేల సువర్ణములెవరికిగావలెను? నేనిచ్చు సమస్యను బూర్తిచేయువారికి, నేనేపదివేలసువర్ణములఁ నిచ్చెదను. సకలరాజాస్థానములఁ దిరిగితినిగాని నాసమస్యను, సరిగఁ బూరించువారు లేరైరి. కాని నీవు సరస్వత్యవతారమవనియు, నీయాస్థానమందుండువారు మహాకవులనియు పెద్దలనేకులు చెప్పవింటిని గాన, నీయాస్థానకవులెవ రేని పూరింతురేమో చూచెదఁగాక యని యిటవచ్చితి.

భోజ—కవీంద్రమా! సమస్యను దెలుపఁగోరుచున్నాను.

కవి—"కుసుమే కుసుమోత్పత్తిః శ్రూయతే నచదృశ్యతే" దీనిని నాయుద్దేశమునసుసరించి పూర్తిచేయవలెను. ఇది సరిగాఁ బూర్తిసేయువారికిఁ బదివేల సువర్ణములిచ్చి నేను వారికి శరణాగతుఁడనగుదును. లేనిచో వారు నాకు శరణాగతులై తామిదివఱకుఁ బొందిన బిరుదులన్నియు నాకుసమర్పింపవలెను.

బాణ—(ఆత్మ) ఆహా! మహాకఠినప్రతిజ్ఞయే. Gr 9043

భవ—బాణకవీ! యీసమస్య "పుష్పమునందుఁ బుష్పము పుట్టినది. ఇదివఱకు వినలేదు కనలే" దను నర్థమును దెలుపుచున్నది. ఇందలి భావమేదియో స్ఫురించుటలేదు. తొందరపడి పూర్తి చేసితిమేని యతని భావమునసుసరించియుండనిచో పరిహసించును. కావున, నాల్గుదినముల వ్యవధి నడుగుదము.

బాణ—ఔను మంచియాలోచన చెప్పితివి.( రాజునుజూచి) రాజేంద్రా! నాల్గుదినములు వ్యవధి యొసంగినచోఁ గవిహృదయమును గ్రహించి దీనిని బూర్తిచేయుదును.

కవి—నాల్గురోజులా! (ఆత్మ) నాల్గుమాసములిచ్చినను బూరింపఁ గలరా! చూతము. కాయుపాసనాబలముచే, సరస్వతిని నిర్బంధించి, వీరికి వాగ్బంధన మొనర్చెదను. (ప్ర) అటులనే కానిండు నేఁటికైదవదినమున నేను ఒరిగివచ్చెదను. నాఁడు నాకుత్తరమును జెప్పవలెను.

భోజ—సరియే. (కవిరాక్షసుఁడు వెడలిపోవును) ఆహా! యిట్టి సమయములోఁ గాళిదాసుఁడు లేకపోయెనుగదా. ఆతఁడుండుచో నీకవిరాక్షసుని లక్ష్యముసేయునా? పెద్దలచేఁ బొగడ్తగనిన నాయాస్థానము నేఁటితోఁ బరువుపోఁ గొట్టుకొనవలసివచ్చెనే!

మ. కుకవుల్ గొండ అసూయచే బలుకువాక్కుల్ నమ్మి మన్మిత్రునిన్
సుకవిన్ బండితవర్యు మామక సభాశోభాయమానాఢ్యు న
త్యకలంకోజ్జ్వలునిన్ బరేంగితుని మాహాత్మ్యైక సంపన్ను నే
నకటా! యెంతటి మందబుద్ధినయి యన్యాయంబుగా వీడితిన్.

ఛీ–ఛీ! కవులారా! మహానుభావుఁడైన కాళిదాసుని దూషించుటకుఁ దగిన ఫలము వెంటనే కల్గినది. నిజముగా వ్యవధిలో పలఁ గవిహృదయమును గ్రహించి సమస్యను బూర్తిచేసి మీ మర్యాదను గాపాడుకొనెదరా?

భవ—రాజేంద్రా! మేమెల్లరము కవిమాత్రులము కాని కాళిదాసుఁడు మహానియుఁడగు వరప్రసాది. పరేంగితముల నెఱిఁగి కవితఁ జెప్పుట యాతనికిమాత్రమే సాధ్యము. కాని మేము ప్రయత్నించి చెప్పినఁ గవిరాక్షసుని మెప్పింపఁజాలమేమో యని శంకించుచున్నారము.

భోజ—అయ్యో! మీరలింతటి వారలే కదా! ఇప్పుడేమి సేయుదును!

బుద్ధి—రాజేంద్రా! యీసమస్యను, గవిహృదయమెఱిఁగి పూర్తి చేయువారికి గొప్పబహుమాన మీయఁబడునని చాటించి

నచోఁ గాళిదాసెక్కడనున్నను దానిని వినినతోడనే పూర్తి చేసితీఱును. అప్పుడ తఁడున్న తావు నెఱింగి యతని బ్రార్థించి తీసికొనివత్తము.

భోజ—నిజము. అటులనే చేయుదము, దీనిని బూర్తిచేయువారికిఁ బది కోట్ల సువర్ణములీయఁబడునని చాటింపఁజేయుము. తరువాతఁ జూతము.

బుద్ధి—చిత్తము. (నిష్క్రమింతురు)

---

## 4 రంగము

### భోజరాజసభ

భోజ—బుద్ధిసాగరా! కాళిదాసుని గుఱికిఁజిక్కిన యాసాధ్వీమణి యెందున్నది?

బుద్ధి—తమ రాజ్ఞయిచ్చినవెంటనే, కాళిదాసునకుఁ దెలియకుండ రాజహార్మ్యమునకుఁ గొనివచ్చి తగుసపర్యలతో నందుంచితిని

భోజ—ఆసాధ్వీమణి యిష్టార్థమెద్దియో యింతవరకును విచారింత మనిన, నాపె యేమనుకొనునోయని యూరకుంటిని. ఆమెను బిలిపింపుము. విచారింతము.

బుద్ధి—చిత్తము. (అనిపోయి మధురవాణితో నచ్చును)

మధు—(వచ్చి దూరముగాఁ దలవంచి నిలుచుండును)

భోజ—ఓ పతివ్రతాశిరోమణీ! నీవీనగరమున కనాథవలెవచ్చిన విషయము మాకుఁదెలిసినది. కాని మిగిలిన విషయము లేమియు మాకుఁ దెలియవు. సంశయములేనిచో, నీయిష్టార్థము నెఱింగించిన దానిని సాధ్యమైనంతవఱకు నెఱవేర్చెద.

మధు—రాజేంద్రా! నాయందు దయగలదేని, నాయొద్దకు, వచ్చిన యా నా ప్రాణకాంతునకు నాపై దయగలుగునటులఁ జేయవలెను.

భోజ—మానినీమణీ! నీకాంతుఁ డీనగరమునం దున్నవాఁడా?

మధు—తమ పోషణలోనే యున్నట్లుగా విన్నాను.

భోజ—ఓహో! యాతఁ డెవ్వఁడో తెలుపఁగోరుచున్నాను.

మధు—రాజేంద్రా! కాళికావరప్రసాదియై మీ కత్యంతాప్తుఁడుగా నున్న కవిసార్వభౌముఁడు.

భోజ—ఏమేమీ! కాళిదాసుఁడా?

మధు—నిజము, ఆ మహానుభావుఁడే.

భోజ—బాగున్నదే, (ఆత్మ) ఇది నిజమైయుండునా? (ప్రకాశము) కాంతామణీ! ఆతఁడు నిన్ను వివాహమాడెనా?

మధు—రాజేంద్రా! విందుసభలో నగ్నిసాక్షికముగ నాజనకుఁడు నన్నాతనికి ధారవోసెను.

భోజ—ఇది మిగుల నాశ్చర్యకరమైన విషయము. నారీశిరోమణీ నీవృత్తాంతమింకను వివరముగాఁ దెలిసికొనఁ గుతూహలపడుచున్నాము.

మధు—రాజేంద్రా! వివరమిప్పుడు దెలుపఁదగదు. రహస్యముగా నుంచి నాప్రార్థన నెఱవేర్తుమని, వాగ్దానమిచ్చినచో సర్వముఁ దెల్పెద.

భోజ—నీకు భయమువలదు. నీయభిమతము నెఱవేర్చెద. సర్వముఁ దెల్పుము.

మధు—నేను దేజోవతీనగరాధిపుఁ డగు విజయవర్మ మహారాజుగారి కుమార్తెను. నా నిజనామము విద్యాధరి. మంత్రియగు కుముద ప్రియుఁడు తన పుత్త్రుని నేను బరిణయమాడలేదను మాత్సర్య మున నన్ను మోసపుచ్చి పామరుఁడగు గొల్లవాని నొకని మహావిద్వాంసుఁ డని చెప్పి నాకు వరునిగాఁ దెచ్చి పరిణయ మొనర్చెను. ఏకాంతమం దున్నప్పు డీవృత్తాంతమును నేను

గ్రహించి నాయుపాసనా దేవతయగు మహాకాళిని బ్రార్థింప నాపై యూతనినాల్కపై, నమృతబీజముల వ్రాసెను. అనంత రమూతని పూర్వవృత్తాంతము విచారింప, నాతఁడు మహావి ద్వాంసుఁడనియు, గురుశాపమున గొల్లలలోఁ దిరుగుచుండె ననియు దెలిసికొంటిని, కాని గొల్లవై పెండ్లియాడినయూపెను, శాపవిమోచనమునఁ దాను బ్రాహ్మణుఁడగుటచేఁ బత్నిఁగాఁ బరిగ్రహింపఁజాలనని తిరస్కరించి వెడలివచ్చెను.

బుద్ధి—రాజేంద్రా! కాళిదాసుఁడెంతటిజితేంద్రియుఁడో తెలిసినదా?

భోజ—నిజము, నేనే మోసపోయితిని.

మధు—అప్పుడు నేను మావృత్తాంతమును రహస్యముగా నొకకాగి తముపైవ్రాసి, నాతండ్రి కందునట్లుగాఁ బెట్టి, యూపరాభవ మును సహింపఁజాలక, యొకపెటుంగరుండ నొంటరిగావచ్చి నూనరక్షణకై పురుషవేషమును దాల్చి నాప్రాణవల్లభుని వెదకుచు నిక్కడికి వచ్చితిని. విలాసవతిచే, నాతనివృత్తాం తము నెఱింగి యూతఁడాపె యింటికివచ్చు మార్గమును బన్ని తిని.

బుద్ధి—లేకపోయిన, వేశ్యాగృహమున కామహానీయుఁడు పోవుట యన నెట్టిది ?

మధు—కాని మహాకాళిమహిమచే నింతవఱకు, నానిజస్థితి యూత నికిఁ దెలియలేదు. తెలిసినచోఁ దిరిగి నన్నుఁ దిరస్కరించి పోవునేమోయని భయపడుచున్నదాన.

భోజ—(ఆశ్చర్యముతో) ఆహా! నిజము. ఇది యుగ్రాహ్యవస్తు వైనచో మహానుభావుని మనస్సు చలింపకుండెడిది. కాని యూతని యర్ధశరీరమగుటచేతనే యూతని నారీతి నాకర్షించి నది. అయ్యో! తెలియక యూతని నిందించి పాపినైతిని.

ఛీ! ఛీ! నేను నిజమును మొదట విచారింపక యవివేకి నైతినిగదా! (ఆలోచించి) ఏమో యీకథయంతయు నమ్ము టెట్లు? స్వకార్యనిర్వహణమునకై స్త్రీలెట్టి యద్భుతచరిత్రలనైనఁ గల్పింపఁగలరు.

కంచు—రాజేంద్రా! జయముగుఁగాక! తేజోవతీనగరాధీశు వద్ద నుండి చారుఁడొక కమ్మను గొనివచ్చినాఁడు.

భోజ—ఓహో! మంచిసమయమున వచ్చెను. (ప్రకాశము) సత్వర మునఁ గొనిరమ్ము.

చారు—(ప్రవేశించి కమ్మనిచ్చును.)

బుద్ధి—(కమ్మనుజదివి) రాజా! తమకిప్పుడు కలిగిన సంశయము నివా రణకాఁగలదు. కానఁ దామేయవలోకింపఁ గోరుచున్నాను. (కమ్మనిచ్చును)

భోజ—(చదివికొని) ఆహా! ఈపె శాస్త్రపారంగతురాలఁట. మన మిప్పుడు విన్నదానికి, నిందువ్రాయఁబడిన దానికిని వ్యత్యాస మావంతయునులేదు. మఱియు (ఉత్తరమును బరికించి తల పంకించి) బుద్ధిసాగరా! కుత్సితుఁడైన మంత్రియు వానికుమా రుఁడు నేమైరో వింటివా? తమ దుర్మార్గమును రాజెఱింగి శిక్షించునను తలంపున వారిద్దఱునునాఁటిరాత్రియే పరరాజు గొల్వున కేగిరఁట. వీరి వృత్తాంతము నంతయు నెఱింగి యిట్టి విశ్వాస ఘాతుకులెవ్వరినైన నిట్టులనే మోసగించెదరని వారల నిర్వురను గారాగారమునందుఁ ద్రోయించెనఁట.

బుద్ధి—బళే! పరులజెఱుపఁ దలంచినవాఁడు తాఁజెడకమానునా!

భోజ—ఆదంపతులను వెదకి తెచ్చినవారికిఁ దన యర్ధరాజ్యము నిచ్చెదనని విజయవర్మరాజు వ్రాసినాఁడు. మనము వెదకి తెచ్చి యాయర్ధరాజ్యము నీదంపతులకే యొసంగుదుము. అయినఁ గాళిదాసుఁడు దొరకవలెనుగదా.

బుద్ధి—అతఁడేకశిలానగరమున కేగినట్లిప్పుడే చారులవలనఁ దెలియ
వచ్చినది.

భోజ—మంచిది. ఇంక నాతని నెట్లైనను గొనిరావచ్చును. కాన
ముందు విజయవర్మ నృపాలునకు దంపతు లిరువురు సుఖ
ముగా నున్నారని కమ్మ వ్రాసిపంపుము. మిగిలిన విషయ
ములు సావకాశముగఁ దెలియఁజేయవచ్చును.

బుద్ధి—చిత్తము (అని చీటివ్రాసిపంపును)

భోజ—

మ. తరుణీరత్నమ! శ్లాఘనీయమగు నీ ♦ ధైర్యంబమోఘంబు నీ
స్థిరచిత్తంబును బుద్ధిసూక్ష్మతయు పా♦తివ్రత్య మాహాత్మ్యముల్
బరికింపన్ గడు విస్మయంబు శుభముల్ ♦ ప్రాప్తించు నీకింక నీ
వరునిన్ గూర్చెద శాంతచిత్తవగుమా ♦ ప్రాజ్ఞైక విద్యాధరీ.

మఱియు

తే. గీ. కీర్తిరొకసారి యొరపిడి ♦ రాళ్ళపగిది
ప్రజల చిత్తప్రభావంబు ♦ బయలుపరచు
వహ్ని మలమలకాలిన ♦ పసిడికెందు
కాంతులంతకంతకు హెచ్చు ♦ గల్గునటుల.

నీపడిన కష్టములే నీసుగుణపుంజముల బయలుపరచెను. నీవు
నిశ్చింతగా నంతఃపురమునందుండుము.

మధు—చిత్తము. (అని వెళ్లును)

కంచు—రాజేంద్రా! జయమగుఁగాక. విలాసవతియను వేశ్య తమ
దర్శనమునకై వచ్చినది.

భోజ—(ఆత్మ) వేశ్యయా! ఏమికారణమై యుండును? (ప్రకాశము)
తీసికొనిరమ్ము.

విలా—[ప్రవేశించి తనలో] ఈసమస్యను గాళిదాసునిచేఁ బూర్తి చేయించి తెచ్చితిని. కాని మధురవాణి యీనగరముననే యున్నదని చెప్పిన, నాతఁడింటేయుండి నాగుట్టుబయటఁ బెట్టునను తలంపున నాపె యేకశిలానగరమునకుఁ బోయెనని యబద్ధము చెప్ప గాళిదాసుఁడు నిరాశుఁడై యేకశిలానగరమునకు వెళ్లిపోయెను. కావున నిర్భీతి నీసమస్యను భోజునకు వినిపించి బహుమతి వడయఁగలను. (ముందునకు వచ్చి) దేవా! నమస్కారము.

భోజ—ఏమిది ?

విలా—తాము ప్రకటించిన సమస్యను బూర్తిచేసితిని.

భోజ—ఏమీ ? నీవుసమస్యను బూర్తిచేసితివా ? ఏదీ చూతము

విలా—(వ్రాసిన కాగితమునిచ్చి) చిత్తగింపుఁడు.

భోజ—(చదివి) శ్లో. కుసుమే కుసుమోత్పత్తిః

శ్రూయతే నచదృశ్యతే

బాలే! తవ ముఖాంభోజే

చక్షురిందీవర ద్వయం.

ఆహా! యెంత గూఢభావము. బాలా! నీముఖమనియెడి తామరపువ్వునందుఁ గన్నుదోయి యనియెడి కలువపూవుల జత యుత్పన్నమైనది యనిగదా దీనిభావము. ఈపె యెంత విద్యావతియైనను బాణుఁడు భవభూతి మొదలగు వారలు పూర్తిచేయఁజాలని యీసమస్య నింత చమత్కారముగాఁ బూర్తిసేయునా ? ఇదియే కవిభావమై యుండును. కాని యిందు బాలేయని సంబోధించియుండుటచేఁ బురుషుఁ డెవఁడో దీనిని రచించియున్నటులున్నది, (ఆలోచించి) ఒకవేళఁ గాళిదాసుఁడీపె యింటనుండి దీనిని బూర్తిచేసి పంపెనా? ఏమైనను

గానిమ్ము. సమస్యమాత్రము పూర్తియైనది. ఇది కవిరాక్షసునకుఁజూపి యనంతరము కాళిదాసుని వెతకెదను.

కవి—[ప్రవేశించి] రాజేంద్రా! సమస్యపూర్తియైనదా?

భోజ—కవివరా! యిదిగో మారాజధానిలోని యీవేశ్య పూర్తి చేసినది. (అని కాగితము నిచ్చును)

కవి—(కోపముతో) ఏమేమి! యీవేశ్య మా పూర్తిచేసినది. ఛీ! నేను నమ్మఁజాలను. దీనికే యింత శక్తిగలదా? (కాగితమునుజూచి చదివి)

శ్లో. కుసుమే కుసుమోత్పత్తిః
శ్రూయతే నచదృశ్యతే
బాలే తవ ముఖాంభోజే
చక్షురిందీ వరద్వయం.

ఇదియే నాభావము. ఈసమస్యను బరేంగితమెఱిఁగి యింత లలితపదకవిత్వమునఁ బూర్తిచేయుశక్తి దేహావిక్రయమొనర్చి జీవించు నీ నీచకులాంగనకుండునా? (ఆత్మ) కాళిదాసుఁడు దీనియింటికి వెళ్ళుటచే రాజుచే నిందింపఁబడి వెళ్ళిపోయినట్లుగా వింటిని. (ప్రకాశము) కావున నిది నిక్కముగా మహానుభావుఁడగు కాళిదాసునిదైయుండవలయును. ఇది యనృతమాడుచున్నది. కావున దీనిని బరీక్షచేయవలెను.

విలా—సరిసరి. కాళిదాసుడెవఁడు? ఆతనిముఖమే నేనెఱుఁగనే.

కవి—ఓసిదాసి.యసత్యములాడవలదు. నీవేసము నేనెఱుంగుదును. (రాజునుజూచి) రాజేంద్రా! అ కాళిదాసుఁడీపెగృహమునసే యుండును. పరీక్షింపుఁడు.

విలా—చూచుకొనవచ్చును. ఊరు విడిపోచియున కాళిదాసుఁడు నాయింట నెట్లుండును?

భోజ—కవీంద్రా! కాళిదాసమహాకవి యేకశిలానగరమున కేగినట్లు వర్తమానము వచ్చినది.

కవి—ఈసమస్యను బూర్తిచేసి యీపెకిచ్చి యేలవెళ్ళగూడదు? అదిగాక కాళిదాసకవి యెవడో యెఱుఁగనని చెప్పియిప్పుడూరి నుండివెళ్ళిన కాళిదాసుఁడు నాయింట నెట్లుండునని చెప్పుచున్నది? ముందు దీనిని బరీక్షింపవలెను.

భోజ—ఇప్పుడేమి చేయుదును? (యోజించి) ఒకవిధముగా నిదియు మంచిదే. ఇప్పుడు నేనేకశిలానగరమునకు మారువేసమున వెళ్ళి కాళిదాసునిగాంచి, యాతనిచే నాచరమశ్లోకమును జెప్పించుటకు దగిన సమయము దొరకినది-(మంత్రినిజూచి ప్రకాశముగా) బుద్ధిసాగరా! నీవు తక్షణమీవేశ్యయిల్లు పరీక్షచేసి యందుఁ గాళిదాసుఁడుండునేమో తెలిసికొనిరమ్ము. అంతవఱకీవేశ్యను మనకట్టడిలో నుండునట్లుగా నేర్పాటుచేసి నిజము తెలిసినమీఁద నీపెకుఁ దగినమర్యాద చేయుదము.

బుద్ధిసా—చిత్తము. (వేశ్యతో నిష్క్రమించును)

భోజ—పూజ్యుడా! మనమును బోవుదమురమ్ము.

(నిష్క్రమింతురు)

# మహాకవి కాళిదాస

## సప్తమాంకము

### 1 రంగము

(ఏకశిలానగర ప్రాంతము)

[యోగి వేషమున భోజరాజు ప్రవేశించును]

యోగి—

మ. జనముల్ గుర్తును బట్టకుండుటకునై సన్యాసిరూపంబునన్
జని యీయేకశిలాపురిం దిరుగ నీ జ్ఞానైకధుర్యుండు న
న్ననుమానించునొ? యేమొ? నీమహిమచే నా కాళిదాసుండు న
న్ననుమానింపక యుండుఁగాత జగదంబా! సర్వవిద్యాంబరో.

ప్రతిదినమును సంధ్యాకాలములయందుఁ గాళిదాసుఁడు కాళికాదేవి దర్శనమునకై వెళ్లుచుండుట నిశ్చయముకదా. ఇదే సంధ్యాసమయమైనది. కావున నీయెడఁ గనబడుచున్న కాళికాలయమున కాతఁడు రావచ్చును. అచ్చటనే యాతనిఁ గలిసికొని మాటాడెదను. (అని ముందునకుఁ బోవును)

కాళి—(ప్రవేశించి తనలో) భోజభూపాలుఁడు నావలనఁ జరమశ్లోకమును జెప్పింపఁబూనుటచే నమంగళమును జెప్పఁగూడదని నేనాతని విడిచి రావలసివచ్చెను. ఇట్టి రసికశిరోమణియగు

ప్రభుని నేనెందును జూడలేదు. చరమశ్లోక విచార
మాతెఁడు విడువకుంటచేఁ గోపమును నటించి యాతని విడచి
యీయేకశిలానగరమునకు వచ్చితిని. ఆతని పాండిత్యము
రసికతయును, స్మరించుకొనినచో నాతని దర్శనభాగ్య మెప్పు
డబ్బునాయని యాతురపడుచుందును. ప్రాణతుల్యుఁడగు
నాతని విడిచినదినములు యుగములుగానున్నవి. కానిమ్ము!
తిరిగి ధారానగరమునకుఁబోయి చరమశ్లోకమును జెప్పెదను.
ఏమిసేయుదును? (ముందునకుఁజూచి) ఓహో! యెవరో పరి
వ్రాజకుఁడరుదెంచుచున్నాఁడు. (ముందునకువచ్చి) పూజ్యు
లకు నమస్కారము.

పరివ్రాజకుఁడు—కల్యాణమస్తు!

కాళి—స్వామీ! తామెవరు? ఎందుండివచ్చుచున్నారు?

పరి—(ఆత్మ) ఆహా! ఈతఁడే మహానీయుఁడగు కాళిదాసుఁడు. ఇప్ప
టికిఁగదా యీతనిదర్శనము తిరిగి దొరకినది. (ప్రకాశముగా)
అయ్యా!

శా. కాశీక్షేత్రమునున్ గయాపురిఁ బ్రయాగన్ శ్రీహరిద్వారమున్
శ్రీశైలంబును వేంకటాచల మహా శ్రీరంగ ముఖ్యంబులౌ
నాశాక్రాంత సుపుణ్యభూములను గన్నాగ న్విలోకించుచున్
దేశంబందలి ముఖ్యపట్టణముల న్వీక్షింపఁగా వచ్చితిన్.

ఔత్తరేయ పట్టణరాజములనన్నియుఁ జూచుచు నిన్నటిదినం
బున నే ధారాపురంబునువిలోకించి నేఁడీపట్టణరాజముం జేరితిని.

కాళి—యతీంద్రా! చాలసంతోషము. కాని ధారానగరమున
భోజభూపాలుఁడు కుశలుఁడై యున్నవాఁడా?

పరి—అయ్యా! యింకెక్కడభోజరాజు! ఆతని ప్రాణాప్తుఁడును,
మహానుభావుఁడునగు కాళిదాస కవీంద్రుఁ డాతనివీడఁ

గోపించి నగరమును విడిచిపోయెనఁట. అదిమొదలు చింతా క్రాంతుఁడై యుండగా రాజాస్థానమునకుఁ గవిరాక్షసుఁడను నాతఁడొకఁడువచ్చి సమస్యనొకదాని నియ్యఁగా దానిని బూర్తిసేయఁగలవారాసంస్థానమునందు లేమిఁ దనకవమానము గలిగెనని కాళిదాసుని స్మరించుచు మనోవ్యథచే భోజభూపాలుఁడసువుల విడచెను.

కాళి—ఏమేమి! భోజభూపాలుఁడు మృతినొందెనా? హావిధీ! నాయర్థ ప్రాణమేపోయెనే. హా భోజరాజా! మహానుభావా! నావియోగముచేఁ బ్రాణములు వాసితివా? నాపై నీకెంతప్రేమగలదు. ఛీ! కాళిదాసా! నీవెంత దురదృష్టవంతుఁడవు. నీప్రాణసమానుఁడగు భోజుని దర్శనము నీకు నాఁటితోనే తీఱెనదా? హా! ప్రియమిత్రా! హా రసికశిరోమణీ!

శ్లో. అద్యధారా నిరాధారా నిరాలంబా సరస్వతీ
పండితాఖండితా స్సర్వే భోజరాజే దివంగతే.

(పరివ్రాజక వేషమునను న్న భోజరాజు పడిపోవును)

కాళి—(ఆశ్చర్యమున) అయ్యో యిదేమి? ఇతఁడెందువలన మృతుఁడయ్యెను! (చక్కఁగాఁజూచి) హా! విధీ! యీతఁడే మహానుభావుఁడైన భోజరాజు. అయ్యో! రసికశిరోమణీ! కలియుగ కర్ణ! నీప్రాణమిత్రుఁడనగు నావలనఁ జచ్చితివా? నేను జెప్పఁగూడని యమంగళ చరమశ్లోకము నీరీతి మోసముచేసి కృత్రిమవేషమున వచ్చి నాచేతనే చెప్పించి యిట్లు మృతుఁడవైతివా. కాళియనుగ్రహముచే నేనాడినమాటలకింతశక్తి కల్గునన్నచో నేనీశ్లోకమును జెప్పియుండను. అయ్యో! ఇప్పుడేమి

సేయుదును? (ధ్యానించి) తల్లీ! మహాకాళీ! నీయనుగ్రహము నిజముగ నామీఁద నున్నచో, నేనాచరమశ్లోకమునే వ్యత్యస్తముచేసి సుఖకరముగఁ బరిణమించునట్లు చెప్పెదను. అప్పుడు భోజరాజు తిరిగి జీవించునట్లుచేసి నావాక్యమును బాలింపుము.

శ్లో. అద్యధారా సదాధారా సదాలంబా సరస్వతీ
పండితా మండితా స్సర్వే భోజరాజే భువంగతే.

భోజ—నారాయణ! నారాయణ! (అని లేచి కూర్చుండును)

కాళి—(భోజరాజును కౌఁగలించి) ప్రాణమిత్రమా! చివరకు నన్నే మోసగించి నీచరమశ్లోకమును నావలననే చెప్పించి యనర్థమును దెచ్చిపెట్టితివిగదా.

భోజ—మిత్రమా! కాళిదాసా! నన్ను క్షమింపుము. ఆశ్లోకము వినవలయుననెడి కుతూహలముకలిగి చివరకు నిను విడనాడ వలసివచ్చినది. నీవులేనిదినాకొకక్షణమేనియు సుఖములేదు.

చం. మెలఁకువతోడనున్నపుడు ♦ మేదినిపై నడయాడు నప్పుడున్
నిలచిన వేళలందు సుఖ ♦ నిద్రనుజెందెడి కాలమందు ని
స్తులమగు భాగ్యభోగ్యముల ♦ సౌఖ్యమునందు నదేల సర్వదా
నిలుచునుగాక నామనము ♦ నీయెడ నోకవిరాజపుంగవా.

నీవు లేని నాయాస్థానము చంద్రుఁడులేని రాత్రివలెనున్నది. నిన్నుఁజూడవలెననెడి కోరికచే నీరీతిఁ గృత్రిమవేషమున వచ్చితిని. నా సర్వాపరాధములను మన్నింపుము. ధారానగరమునకుఁ బోవుదము రమ్ము.

కాళి—భోజరాజా! నిన్నువీడి నేను క్షణమొకయుగముగఁ గడుపుచు నిన్నే స్మరించుచుంటిని. నీవిషయమై యమంగళకర

శ్లోకమును జెప్పఁజాలక నీకంటికిం గనఁబడకుండ నుండ నా చేతనే తిరిగి యీ శ్లోకమును జెప్పించి మృతుఁడవై తివిగదా?

భోజ—మిత్రమా! మృతుఁడనై నేనెట్లు తిరిగి బ్రతికితిని?

కాళి—మహాకాళి యనుగ్రహముచేత. అంబికను ధ్యానించి యాచరమశ్లోకమునే వ్యత్యాసమొనర్చి

శ్లో. అద్యధారా సదాధారా సదాలంబా సరస్వతీ
పండితా మండితా స్సర్వే భోజరాజే భువంగతే.

అని చెప్పితిని. అప్పుడు నీవు తిరిగి బ్రతికితివి.

భోజ—ఆహా! జీవనమరణములు నీయధీనమందున్నవిగదా. మహానుభావుఁడవు. "త్వమేవాహం నసంశయ" యని మున్ను నీతో సరస్వతీ దేవి చెప్పిన వాక్యములు సత్యములని దృష్టాంతమౌనకు వచ్చినవి. నిన్ను దూఱి నేనవివేకినైతిని. మిత్రమా!

శా. మాకందంబులలేఁజివుళ్ళఁ దినుచున్ ♦ మాధుర్యగానంబుతో
లోకానందముఁగూర్చివిస్తుల యశో ♦ లోలత్వముం జెందఁగా
నీకోఁగాని తదన్యవృక్షములపై ♦ నీవున్నఁ దచ్ఛోభితా
స్తోకానందము సత్కవీంద్రపికమా! ♦ చూపట్టునే చెప్పుమా.

కాళి—

ఉ. ఓకవిరాజ రాజ! రసి ♦ కోత్తమ! భోజనృపాలసత్తమా!
లేకితనంబునన్ గుణము ♦ లేక తదన్యుల సద్గుణంబులన్
గా కొనరింపఁజూచు ద్విజ ♦ కాండమునన్ గడునీచమైన ప
ల్గాకులు లేకయున్న సహ ♦ కారముఁబాయునె! కోకిలంబిలన్,

భోజ—నాకుఁ బ్రాణదానమొసంగిన నీకు నేనొక పారితోషికమర్పిం
పవలెనని కుతూహలపడుచున్నాను గావున నీవు ధారానగర
మునకువచ్చి దానిగ్రహింపవలెను. రమ్ము.

కాళి—అటులనే కావచ్చును.

(పోవుదురు)

తెర పడును.

---

## 2 రంగము

### ధారానగరము — భోజాస్థానము

[భోజ, కాళిదాస, బుద్ధిసాగర కవిరాక్షసులు
కూర్చుండియుందురు]

కవి—రాజా! పూజ్యుఁడగు కాళిదాస కవిచంద్రునకు నా సమస్య
నెఱింగింపుము.

భోజ—అవును. కాళిదాసా! "కుసుమే కుసుమోత్పత్తిః శ్రూయతే
నచదృశ్యతే"

కాళి—"బాలే తవ ముఖాంభోజే, చక్షురిందీవర ద్వయం" మ్మని
యీసమస్య నిదివఱకే విలాసవతికిఁబూర్తిచేసియిచ్చియుంటి నే.

కవి—రాజేంద్రా! యిప్పుడైనను నీసంశయము నివారణ మైనదా?
యిప్పుడు నేను గాళిదాస కవిచంద్రునికి శరణాగతుడనైతిని.
(అని నమస్కరించి) ఈ వేశ్య సభామధ్యమునఁ దానీసమస్య
పూర్తిచేసితినని చెప్పినందులకు దానికిఁదగినశాస్తిచేయవలెను.

భోజ—(బుద్ధిసాగరుని బ్రేరేపించి) మంత్రీ! కాళిదాసకవీంద్రుడు నాచే బారితోషికము స్వీకరించుట కంగీకరించెను. కాన మన శరణుజొచ్చిన మధురవాణి నితనికర్పించుట కిదియే మంచిసమయము ఆమెనుగొనిరమ్ము. (బుద్ధిసాగరుఁడు వెడలి మధురవాణితో వచ్చును)

భోజ—

చం. రసికశిఖావతంస కవి ♦ రాజనకే యనురూపమంచు నీ
కుసుమ సుగాత్రిని౯ సుగుణ ♦ కోవిదను౯ విదుషీమణిన్ మహా
రసికశిరోమణిన్ మిగుల ♦ శ్రద్ధను బ్రోచియు నీకొసంగు యీ
పసదనమున్ గ్రహింపుము వి ♦ వాహమున౯ భువనైకపూజితా॥

కాళిదా—(ఆత్మ)

మ. భళిరే! యెంతటి చిత్రసంఘ సమకూ ♦ ర్పన్ జాలితీవౌర! యే
లలనారత్నముపై మనంబెవనికి ♦ న్లగ్నంబుగానౌనొ త
జ్జలజాక్షిన్ బహుమానమీయఁగను వి ♦ శ్వంబం దెవండేనియున్
వలదంచున్ వచియింపగాఁగలడె భూ ♦ పాలైకచూడామణీ!

రాజేంద్రా! యీపె నాటిరాత్రి మనముచూచినబాలగాదా?

భోజ—అవును, ఈపె వృత్తాంతము వివరముగాఁ దెలియదుగాని సత్కులజాతయైన యీపె పాండిత్య కౌశలమునుజూచి నీ కనురూపమగు వస్తువని తలంచి యంతఃపురంబునఁ గాపాడు చుంటిని. కావున నాయిష్టార్థమును నీవు నెఱవేర్పవలెను.

కాళి—రాజా! నీమాటకు మాఱుచెప్పుదునా?

భోజ—మధురవాణీ! అదిగో నీప్రాణకాంతుఁడు. నమస్కరింపుము.

మధు—(ముందునకువచ్చి పాదముల నమస్కరించును) ఆర్యపుత్రా! మీయర్ధాంగిని బరిగ్రహింపుఁడు.

కాళి—మనోహారిణీ! భోజభూపాలుని చేఁగూడఁ బ్రసాదింపబడుటచే నిదే నిన్నుఁ బరిగ్రహించుచున్నాఁడ లెమ్ము (అని లేవనెత్తును)

మధు—ప్రాణేశ్వరా! తనుపంతము నామహాకాళి మహిమయు నీ భోజభూపాలుని యనుగ్రహమును జయించుటచే నేను ధన్యురాలను.

కాళి—ప్రాణేశ్వరీ! నీమాట లేమియు నాకర్థమగుట లేదు.

మధు—(తనలో) మహాకాళి వరప్రభావమున నన్నాతఁడు గుర్తింపక పరిగ్రహించెను. ఇఁక మెల్లగ నావృత్తాంతము నెఱుంగఁ జేసెదను. (ప్రకాశముగా) క్షమించి నావృత్తాంతమాలకింపుడు.

సీ. కమనీయమగు మీఁదు ♦ కపట విప్రాకృతిఁ
గాంచి వరించిన ♦ గరితె యెవ తె?
సముదప్రియుఁడు పన్న ♦ కుట్ర తెలుంగక
మీఁపొందితి యటంచు ♦ మెచ్చెనెవ తె?
కలరూపెఱింగి యా ♦ కాళీమహిమ మిమ్ము
విద్యాసనాథుఁ గావించె నెవ తె?
విద్యాసనాథులై ♦ వెడలెడు మీచేతఁ
గడుఁగ్రూరత విడువఁ ♦ బడియె నెవ తె?

గీ. యట్టి హతభాగ్యురాలు మ ♦ హాభవాని
పరమకృపనేఁటికి మధుర ♦ వాణి యగుచుఁ
ద్వత్పరిష్వంగ సౌఖ్య మో ♦ దమునఁ దేలు
రాజకుమారి యౌ విద్యాధ ♦ రీ కుమారి.

కాళి—ఆహా! మోసపోతిని! విద్యాధరీ! మోసముచే నన్నుఁ జేపట్టనెంచితివా?

మధు—(భయముతో) నాథా! మహాకాళియాజ్ఞయే కాని యిందు మోసమింతయును లేదు.

కాళి—ఛీ! యిట్టి పాపకార్యమును జేయ మహాకాళి నీకనుజ్ఞ నిచ్చునా? నేను నమ్మఁజాలను. (కాళికి నమస్కరించి) తల్లీ! నామహాపరాధమును క్షమింపుము.

మధు—అయ్యో! నాపతి నన్ను విడచునాయేమి! యిప్పుడేమిగతి! ఆ మహాతల్లియే నన్నుఁ గాపాడవలయును. (భర్తదిక్కై) నాథా! యిప్పుడు మీరొనర్చిన మహాపరాధమేమి?

కాళి—పూజింపవలసినదాని గాఁగలించు టపరాధము కాదా?

మధు—నిండుసభలో నాడినమాట దప్పుటపరాధము కాదా?

కాళి—మధురవాణీ! నీవాదములతో నాకునిమిత్తము లేదు. మోస మొనర్చువారెప్పుడును బరిత్యాజ్యులే కదా!

భోజ—కాళిదాసా! ఏమంటివి. ఈమె మోసమొనర్చెననియా!

సీ. కపటవేసమున యీ ♦ గరితను బెండ్లాడు
సగణిజూడగను మో ♦ సంబుగాదె?
పెండ్లియాడితివి పో ♦ పేర్మి సంసారంబు
సలుపమిజూడ మో ♦ సంబుగాదె?
పోనిమ్ము! మిత్రవా ♦ గ్దానమ్ము చెల్లింప
నైపమిఁజూడ మో ♦ సంబుగాదె?
అదియు బోనిమ్ము నీ ♦ యర్థాంగికిడిన బా
సయు తప్పుటరయ మో ♦ సంబుగాదె?

గీ. ఇన్ని మోసంపు దోసంబు ♦ లెన్నవీవు
సదమలర్థాంగి స్వల్ప దో ♦ షంబునొండు
గణనసేయుట భావ్యంబు ♦ గాదలంతె!
కవిజనోల్లాస! శ్రీమహా ♦ కాళిదాస.

కాళి—(ఆలోచనతో) ఎట్టివిషమావస్థ తటస్థించినది! ఎట్లొనర్చుట కును నాయంతరాత్మ వెనుకాడుచున్నది. ఇప్పుడు జగజ్జనని యగు మహాకాళియే నాకుఁ గర్తవ్యమును దెల్పవలెను. తల్లీ!

శ్లో. బాలామృతాంశునిభ ఫాలా మనాగరుణచేలా నితంబఫలకే
కోలాహలక్షపిత కాలామరాకుశల కీలాలశోషణరతా
స్థూలాకుచే జలదనీలాకచే కలితలీలాకదంబవిపినే
శూలాయుధ ప్రణతిశీలా విధాతుహృది శైలాధిరాజతనయా.

శ్లో. వందారులోక వరసంధాయినీ విమలకుందావదాతరదనా
బృందారబృందమణి బృందారవిందమకరందాభిషిక్తచరణా
మందానిలాకలిత మందారదామభిరమందాభిరామ మకుటా
మందాకినీ జవనభిందాన వాచమరవిందాసనా దిశతు మే.

తల్లీ! నాయపరాధములు మన్నించి కింకర్తవ్యతామూఢుడనై యున్న నాకు నీదివ్యదర్శనమొసంగి కర్తవ్యము బోధపఱచి నన్నుఁ గృతార్థుని జేయుము.

[ కాళి ప్రత్యక్షమగును, అందఱు నమస్కరింతురు ]

కాళికా—వత్సా! కాళిదాస! నీవు వెనుక గొల్లఁడవుగానున్న సంగతి నీకు జ్ఞాపకమున్నదా!

కాళి—జననీ! లేదు!

కాళికా—మంచిది! వినుము. నాసంకల్పముచేతనే నీవీమెను త్యజించి మఱచిపోయితివి. ఈమె పవిత్రురాలు. మహాపతివ్రత. నీయనుగ్రహమునకు బాత్రురాలు. నాఁడు గొల్లఁడు విద్యాధరిని వరించినాఁడుగాని నేఁడు కాళిదాసుని మధురవాణి వరించినది. అందుచే దోషమెంతమాత్రమును లేదు. కావున నీసుదతీమణిని బత్నిఁగాఁ బరిగ్రహించి చిరకాలము యశోరాజ్యరమను బరిపాలింపుము.

కాళి—తల్లీ! నీయాజ్ఞను శిరసావహించుచున్నాను. నీదివ్యకృపారసంబు నాపైఁజూపినందులకనేకవందనములు.

కాళికా—కాళిదాసా! సంతోషము. బాలా విద్యాధరీ! నీవుమహా పతివ్రతవు. కాళిదాసుఁడు సత్యసంధుఁడు. జితేంద్రియుఁడు. మీకీర్తి లోకవిఖ్యాతమగుటకై నేనీవిచిత్రమెల్ల గావించితిని. కాని నీవు మహావిద్వాంసుల నవమానపఱచుటచే నీకీ కష్టములు సంప్రాప్తమైనవి. కావున నిగర్వచూడామణివై మనుము. నీవుకోరఁదగిన దేమైనఁ గలదా?

విద్యా—తల్లీ! క్షమించి నీపరిపూర్ణ కృపాకటాక్షము మాత్రము నాపై నుంచుము.

కాళికా—నీయభీష్టము నెఱవేఱుఁగాక. ఓభోజభూపాలా! నీవు సరస్వత్యవతారమవు. ఈకాళిదాసుఁడే నేను. ఈమహాకవి సార్వభౌమునిచే నీకీర్తి దిగంతముల వ్యాపించును గాన వీనిని దక్షిణభుజంబుగా నెంచుకొని రాజ్యపరిపాలన మొనర్పుము.

భోజ—(నమస్కరించుచు) జననీ! ఈమహానీయునిమూలమున నీ దర్శనభాగ్యమబ్బినది. ధన్యాత్ముఁడనైతిని.

సీ. కాళీ! సుశీలాల ♦ కాళీ మహాకాళి!
పాలిత నరసుర ♦ పాళివగుచు
మాతః తుహినశైల ♦ జాతా! జగత్త్రియ
పూతా! ప్రవిమల వి ♦ ఖ్యాతవగుచు
శ్యామా! జితాఖిల ♦ కామా! సురక్షిత
కామ! సాహిత్యాభి ♦ రామవగుచు
శాంతా! శివప్రియ ♦ కాంతా! దయాకర
స్వాంతా! దురిత నిచ ♦ యాంతవగుచు

గీ. త్వత్పదాబ్జముల దివ్యదర్శన ♦ భాగ్య మొసఁగి
ధన్యనొనరించితివినన్ను ♦ దయదలిర్చి
పరమకళ్యాణి! నిఖిల ప్ర ♦ పంచమునకు
హాయిగూర్పుమ లోక క ♦ ల్యాణివగుచు.

కాళికా—భోజరాజా! నీయభీప్సితము సిద్ధించుగాత కాళిదాసా! ఇంక నీయభీష్టమే దేనియున్నఁ గోరుకొనుము.

కాళి—తల్లీ! లోకానుగ్రహముగాక నాకింకఁగావలసినదేమి? (తనలో) అయినను నిట్లుకోరెదఁగాక (ప్రకాశము) జననీ!

## భ ర త వా క్య ము

తే. గీ. ధర్మమార్గంబుదప్పక ♦ ధరణిధవులు
నీర్ష్యయుంతయులేక ♦ నింద్రుఁడయును
నఘమెఱుంగక భక్తితో ♦ సఖిలజనులు
శ్రీశిఁజరింత్రుగావుతఁ జిరం ♦ జీవులగుచు.

కాళికా—మహాకవీ! నీయభీష్టము ఫలించుఁగాక! (అదృశ్యయగును) (తెరపడును)

శ్రీ. శ్రీ. శ్రీ.

ఇ ది స ప్త మా ం క ము
సంపూర్ణము.